# సాహిత్యోపన్యాసములు

16 



మహాకవి సూర్‌దాస్ పంచశత జయంత్యుత్సవసభ
సందర్భమున జరిగిన ఉపన్యాస సంకలనము.




ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు.

**SAHITYOPANYASAMULU-16**

Speeches delivered by **Dr. (Smt.) Leela Jyothi,** Lecturer in Hindi, Women's college, Osmania University, **Hyderabad** and **Dr. C.H. Ramulu,** Lecturer in Hindi, Kakatiya University, Warangal, on the occasion of 5th centenary celebrations of Suradas.

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాద్-500 004

ప్రచురణ : 299

ప్రథమ ముద్రణ : జనవరి 1980.

ప్రతులు : 1000



వెల రూ. **3-00**

ప్రతులకు :
**ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,**
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004.

ముద్రణ :
**తరణి ప్రెస్,**
**మహంకాళీ వీధి,**
**సికింద్రాబాదు.**

# తొలిపలుకు

హిందీ మహాకవి సూరదాస్ పంచశత జయంత్యుత్సవాలను పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 21-4-79 నాడు అకాడమీ అధ్యక్షులు డా. బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతన సమావేశాన్ని ఏర్పాటుచేసింది. ఆ సందర్భంగా 'సూర్‌దాస్ జీవిత సాహిత్యా'లను గూర్చి ఉస్మానియా విశ్వవిద్యాలయ మహిళా కళాశాల హిందీ అధ్యాపకులు డాక్టర్ (శ్రీమతి) లీలాజ్యోతిగారు, 'సూర్‌దాస్ కవితాసౌందర్యాన్ని గూర్చి కాకతీయ విశ్వవిద్యాలయం హిందీ అధ్యాపకులు డా. సి. హెచ్. రాములుగారు ప్రసంగించారు.

ఈ ప్రసంగాలను 'సాహిత్యోపన్యాసములు-16' గా రూపొందించి పాఠకలోకానికి అందజేస్తున్నాం. భారతదేశంలోని బహుభాషాసాహిత్యాల పట్ల సదవగాహన పెంపొందడానికి ఈ విధమైన సాహిత్యం తోడ్పడుతుందనే ప్రత్యయంతో ఈపుస్తకాన్ని ప్రచురిస్తున్నాము. తమ ప్రసంగాలను ప్రచురణార్థం మా కందించిన డా॥ (శ్రీమతి) లీలాజ్యోతిగారికి, డా॥ సి. హెచ్. రాములుగారికి మా కృతజ్ఞతలు

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

27-1-1980.

# సూరదాసు కవితా సౌందర్యం

—డా॥ Ch. రాములు

హిందీ కావ్యసాగరంలో వీరగాథాలహరి మొదటి వీచిక. మధ్య యుగంలో హిందువులు స్వాతంత్ర్యం కోల్పోయిన తరువాత వీరగాథలు కాలగర్భంలో కలిసి పోయాయి. ఆ హీనదీనస్థితిలో వీరలు వీరగాథాగానం ఏ ముఖంతో చేస్తారు. ఏ వీనులతో పరాక్రమ గాథలు వింటారు జనమానసంలో ప్రగాఢమైన ఉదాసీనత వ్యాపించింది. రాముడు, రహీము ఒకడే అని చెప్పే నిర్గుణ ప్రేమ మార్గం ముకుళిత మానస కుసుమాన్ని వికసింప జేయలేక పోయింది. దాని వెనుక దాగి ఉన్న పాషాణ సదృశమైన, కఠోర కుఠారస్వరూపమైన ఏకేశ్వర వాదం, దాని పాశవిక కార్యప్రణాళికను చవిచూచిన జాతి తన అస్తిత్వం కోసం పునః ప్రయత్నం సాగించింది. అందుకై తన సభ్యతా సంస్కృతుల చిరంతన సంస్కారాల రక్షణకై ఆరాటపడసాగింది. ఆ సంతప్త మానసానికి భక్తి ప్రవంతి అనే అమృతం లభ్యమైంది. రాముడు ఆర్తజన రక్షకుడై నిలిచాడు. కృష్ణుడు ఆనంద ప్రదాత అయినాడు. జాతిలో శక్తిని శీలమును సౌందర్యమును ప్రతిష్ఠింప జేయుటకై జాతి పునర్నిర్మాణ కార్యంలో అనేకులు మహనీయులు, భక్త ప్రవరులు, సాధుపుంగవులు, మహాకవులు, శ్రీరామానందుల, శ్రీవల్లభాచార్యుల ప్రేరణ, నిర్దేశములను పొంది పరమభావంతో ఆనందడోలికలలో తేలియాడారు. జీవితంలో స్వారస్యాన్ని ప్రేమను పాదుకొల్పుటకు, జీవితంపై కనీస మమకారం కల్గించ డానికి, జీవించుదామనే కామన కల్గించడానికి కళను, సారస్వతాన్ని ఆశ్రయించారు. దీని పరిపూర్ణవికాసం భక్త తులసీదాసు 'రామచరిత మానసం'లో, తరువాత సూరదాసు రచించిన 'సూరసాగరం' లో కనిపిస్తుంది.

శ్రీ వల్లభాచార్యుల ముద్రగల 'అష్టఛాప్' కవుల ఎనిమిది వీణలు, శ్రీకృష్ణుని ప్రేమలీలల సంకీర్తనలలో ఒకే మారు ఝుంకృ

తమైనాయి వీటన్నిటిలో అత్యంత మధురము, ప్రవణము అయినది అంధుడైన సూరదాసు వీణ. నిరిసగుణోపాసనలో నీరసమైన అగ్రాహ్యమైన నిర్గుణ తత్త్వము సగుణమై హృదయగ్రాహ్యమై ప్రేమమయమై చిత్తాకర్షకమైనది. భగవానుడు కోమల వృత్తుల కాశ్రయుడై ఆలంబనుడై నిలిచాడు.

సూరదాసు కన్నులు మూసికొనియే యున్నాడు. అయినా ముగ్ధమనోహరమైన మోహనుని బాల్య యౌవన రూపములను దర్శించాడు. వాత్సల్య శృంగారములను అపురూపముగా వర్ణించాడు. వాత్సల్య భావంలోని ఏ వృత్తినీ ఆయన వదల లేదు. ఆయన స్పర్శించని అంశం అంటూ లేదు. రసరాజ శృంగార వర్ణనలో సూరదాసు పొంగి పొరలుతున్న వాగ్ధారలో ఆ వరదలో పరంపరాగతమైన విభావానుభావసంచారులను, రసభావ ప్రవాహములో వంతలలో పుంతలలో ముంచెత్తి ముందుకు సాగిపోయాడు. సూరదాసు విప్రలంభ శృంగార వర్ణనలో భ్రమరగీతలలో మానసిక దశలెన్నో. వాని ప్రతిక్రియలెన్నో, తాపపు మర్మములెన్నో చెప్పలేము. నేటికిని వాటికి శాస్త్ర గ్రంథములలో నామ కరణ జరుగలేదు. దీనినే కవితా బిగువు పట్టు అనవచ్చును. కవికళాదర్శన మనవచ్చును. అయినా మిగతా రసముల వర్ణనలో మానవ జీవిత సంపూర్ణ దర్శనంలో సూరదాసు దృష్టి పరిమితమైనదనే చెప్పాలి. శృంగార వాత్సల్యములలో తానెన్నుకొన్న దృక్కోణములలో ఆయన కళ అపారంగా విస్తరించింది. ఈక్షేత్రంలో ఆయనకు సాటి మరి లేరు.

మరో విశేషం ఆయన సాహిత్యం సంగీత సాగరం. జయదేవుడు, విద్యాపతి పరంపరలోని శృంగారాన్ని పుణికిపుచ్చుకున్నాడు. సంగీతం సూటిగా సారస్వతాన్ని హృదయంలోకి దింపింది. సంగీత సాహిత్యాలకు ప్రేరణ ప్రాణం శ్రీ వల్లభుడు ప్రసాదించిన భక్తితత్త్వం. భగవానుడు ప్రేమమయుడు. తద్వారా సాయుజ్య మోక్షం సిద్ధిస్తుంది. ఇది ధర్మనిరతి, ధర్మాంభి నివేశం అద్వైతసిద్ధి. భక్తియొక్క పరమ లక్ష్యం, ఆకావ్యం లోక కళ్యాణకారకం, ఆకళ అత్యుత్తమమైనది. పరమ ఉజ్జ్వలమైనది.

పుష్టిమార్గము ననుసరించిన సూరదాసు ప్రేమ తత్త్వనిరూపణ రతిభావము ముఖ్యంగా మూడు రూపాలలో దర్శనమిస్తుంది. భగవద్విషయకరతి, వాత్సల్య మరియు దాంపత్యరతి. ఇవి యన్నీ కృష్ణోన్ముఖమైనట్టివి. సూరదాసు వినయపదాలు, పుష్టి దీక్షకు ముందు రచించిన సంకీర్తనలు భగవద్విషయకరతికి సంబంధించినవి. బాల్యలీలలు వాత్సల్యరతి, గోపీప్రేమసంబంధమైన పదాలు దాంపత్యరతి పరమైనవి సూరదాసు ఇట్టి మూడు ప్రముఖధారలలో సూరసాగరం నిర్మించాడు.

విభావాను భావ రూపములలో ఆలంబన ఉద్దీపన రూపములలో శృంగార వాత్సల్య వర్ణనలో సూరదాసు రాధాకృష్ణుల నానారూపముల వేశములలో, చేష్టలలో నికుంజముల, లతావనముల, యమునాతటముల, పవనము, చంద్రుడు, ఋతువుల వర్ణనలో అపూర్వ ప్రతిభను ప్రదర్శించాడు, విభావ పక్షంలో రెండు విధాలు. వస్తు రూపములో మరియు అలంకారరూపములో అనగా ప్రస్తుత అప్రస్తుత రూపములలో వస్తువర్ణన ఉంటుంది. అనగా శ్రీ కృష్ణుని నీలవర్ణన సందర్భంలో పీతాంబరమును, త్రిభంగిముద్రను, స్మిత ఆననమును, కరముల మురళిని, శిరముల కేశముల, నెమలి కన్నుల కిరీటమును ముందుగా వస్తురూపములో వర్ణిస్తాడు. తరువాత యమునాతటమును, లహరులను, లతావనములను, విప్ఫారిన వెన్నెలను, కోకిలకూజనములను కన్నులకు కట్టినట్లు దృశ్యమును చిత్రిస్తాడు. దీని వెంటనే నీలమేఘమును, విద్యుల్లతను సనాళకమలమును విన్యాసాలంకారములుగా తెస్తాడు. సూరదాసు వర్ణ్య విషయము సీమితమైనందున వస్తువిన్యాసంలో సంకోచం ఉంది. కాని అలంకార వస్తువుల సంఖ్య అపరిమితం. సూరదాసు రాధా కృష్ణుల అంగప్రత్యంగముల ముద్రల చేష్టల, యమునాతటము, వంశీవటము గోచారణ, వనవిహారము బాల లీలలు, దొంగతనము, తుంటరి వేశముల సందర్భములలో కవిపరిపాటి ననుసరించి ఋతుక్రమమున కనుగుణ్యమైన వస్తువులను మాత్రమే వర్ణించి ఔచిత్యం ప్రదర్శించాడు. కారణం సూరదాసు ప్రబంధ కావ్యం రచించడం లేదు. కథాక్రమం లేదు. ఘటనా శృంఖలం

లేదు. వేరువేరుపదాలు, స్వతంత్ర వీచికలు, అనేకరాగరాగి ణుల వీణారవములు. విచిత్ర స్వర సమ్మేళనం. ఒకే భావం పలు మారు పలురీతుల కనుల ముందుంటుంది. అనందం, ఆస్వాదన అపారం. సూరకావ్యం మధుమయ ధ్వని ప్రవాహం. అందు కొన్నివస్తు విన్యాసాల దృశ్యమాత్రంతో రససృష్టి జరిగిపోతుంది. ఒకే ఘటనకు సంబంధించిన అనేక లీలావిన్యాసాలు దర్శన మిస్తాయి.

సూరకావ్యం సీమితమవడానికి మరో కారణం ఆయన ఎన్నుకొన్న వృత్తులు ప్రధానంగా రెండు మాత్రమే కావడం. అవి బాల్య వృత్తి మరియు యౌవన వృత్తి.ఇందులో క్రీడలు ఉద్రేకం, ఆవేశం ఆవేగం ఉంటాయి. ప్రయత్నవిస్తారం లోకసంఘర్షణ లేదు. అది ఒక మనోరాజ్యం, దివ్యలోకం, జీవితంలోని ఘర్షణ అనేకత్వం లేదు. బాలక్రీడలలో ప్రేమస్వరూపము అతృప్త వాసన వరకే పరిమితమయింది. గంభీర సమస్యలు ఆవేశకావేశాలు, కార్పణ్యం, క్రోధాగ్ని జ్వాలలు లేవు. వస్తుగాంభీర్యము, స్థితిగాంభీర్యము లేదు. సూరదాసు వియోగ వర్ణన వియోగ వర్ణన కొరకు మాత్రమే, పరిస్థితి ప్రభావం కాదు. గోపికలతో దోబూచులాడుతూ మురళీ మోహనుడు పొదల మాటున దాగుతాడు. క్షణకాలం అదృశ్యమవుతాడు. అంతలో విరహం, అంతలో సంయోగం మరి వియోగం, తపన, సుఖం, ఫలకాంతర ప్రేమ ఫలకాంతర వియోగం, కల్పనాశక్తి ఉద్భృతం, అంతలోనే కన్నీరు మున్నీరుగా విలాపం, పూర్ణ వియోగ దశను అనుభవిస్తారు. ఆక్షణ కాలం అది అసంగత మనిపించదు. సామాన్య దృష్టికి అసంగత మనిపించినా కావ్యదృష్టికి అది ప్రధానం. సూరసాగరం ప్రబంధకావ్యం కాకపోవడం గమనార్హం.

సూరదాసు కావ్యోద్దేశం ముఖ్యంగా శ్రీకృష్ణుని వ్రజలీలల భావాత్మక చిత్రణ. భాగవతకథను అనుసరించి ఆయన తన కావ్యంలో వ్రజభూమిలోని శ్రీకృష్ణలీలలను అతివిస్తృతంగా, అత్యుత్తమంగా చిత్రించాడు. సూరసాగరంలో భాగవతంలోని పన్రెండు స్కంధాలలో వర్ణితమైన శ్రీకృష్ణచరితంతో పాటు అవతారాల, పౌరాణిక

న రేశుల వర్ణన ఉంది. ప్రబంధరూపంలోనో, బాహ్యావిషయదృష్టితోనో లేక ఒక క్రమంలో శ్రీకృష్ణచరితం అంకితమైంది. అనేక సంఘటనలు, వివిధఇతివృత్తాల వర్ణన ఉన్నప్పటికీ సూరకావ్యంలో ప్రబంధరచనా శైలికి సంబంధించిన అంశము లేవీ లేవు. ప్రబంధ కావ్యానికి అనివార్యమైన లక్షణములు అనగా శృంఖలాబద్ధమైన కథాప్రవాహం, కథమధ్యలో ప్రాకృతిక దృశ్యములు, ఘటనాస్థలాల వర్ణన, పాత్ర ఉత్తరోత్తర వికాసం, వివిధ దశలలో ఘటనా చక్రముల బంధన, ఏక సూత్రీకరణ సంభాషణల భావనా స్థలాల అంకన, సర్గలలో ప్రబంధకావ్య విభాజన మొదలగు లక్షణాలు లేవు. వస్తువర్ణనకంటె భావచిత్రణ పట్ల సూరదాసు ప్రత్యేకశ్రద్ధ చూపాడు. శ్రీకృష్ణ చరిత్రం క్రమంగా చెప్పినప్పటికీ ముక్తకావ్యమే అయింది. నవమస్కంధంలో సూరదాసు శ్రీరామచరితం సంక్షిప్తంగా రచించాడు.

సూరదాసు కావ్యంలో భావమయమైన శక్తిప్రేరణ ప్రధానంగా ఉంది. ఆయన తన అంతరాత్మలో అనుభూతితీవ్రతను అనుభవించిన సందర్భాలను మాత్రమే గ్రహించాడు. అందువలన ఆయన కావ్యంలో భావనామయమైన స్థలాలు రసాత్మకమై తదితర ఘట్టాలు నీరసంగా ఉన్నాయి. సూరదాసు మానసికవృత్తి లీలలలో లీనమైంది గాన వాటినే తన్మయుడై వర్ణించాడు. దీనికారణంగా సూరదాసు బాహ్యావిషయాత్మకశైలిని అనుసరించక ఆత్మవిషయాత్మకశైలిని ఉపయోగించాడు. అందువలననే ఆయన కావ్యంలో హృదయాన్ని ద్రవింపజేసే శక్తి అమితంగా ఉంది. సూరదాసు కావ్యంలో కళాసౌందర్యానికీ, భావశబలతకు సంపూర్ణ అభివ్యక్తీకరణ జరిగింది. అందులకే ఒకానొక సూక్తికారుడు 'సూరదాస్ కో పద అగ్యో తన మన ధునత్ శరీర్' అన్నాడు. అనగా సూరదాసు పదం పఠించడంతో తనువు, మనసు మరిచి పులకితమై పోతాము. ఇట్టి సూరదాసు కావ్య వైభవమును సమగ్రంగా కాకపోయినా స్థాలీపులాక న్యాయంగా చర్చించడం అనగాహానచేసుకోవడం సమంజసం. ఈ వ్యాసంలో అట్టి ప్రయత్నం జరిగింది.

# భావ సౌందర్యము

భక్తితత్త్వము:—

మహాకవి సూరదాసు ఆర్తభక్తుడుగా అవతరించి సఖ్యభావంతో లీలాధామంలో ప్రవేశించాడు. ఈ రెండు భావాలమధ్య లీలలకు సంబంధించిన ఎంత భావరాశి ఉందో, అంతటినీ అనుభవించి సూరసాగరంలో అంకితం చేశాడు. భక్తిభావన అన్ని భావాలకు మించిన ఊర్ధ్వతమ స్థితి. అన్నిభావాలకు అది మూలం. శాంతరసం మరియు భక్తి భావన రెండూ అన్యోన్యాశ్రితాలు. రసగంగాధర ప్రణేత పండితరాజ జగన్నాథుడు శాంతరసాన్ని భక్తికి అంతర్భాగంగా స్వీకరించలేదు. కారణమేమంటే శాంతరసస్థాయీభావం నిర్వేదం అయితే భక్తిభావన పరమేశ్వరుని పైగల పరానురక్తి, నిర్వేదము, అనురాగం రెండు పరస్పర విరుద్ధాలు, భక్తిలో రతి ఉంటే నిర్వేదంలో విరతి, కాని వస్తుస్థితి ఇది కాదు. నిర్వేదము, తటస్థభావము సంసారపక్షంలో ఉంటుంది. భక్తిలో కూడ అభావమే ప్రధానము. భక్తుడు కూడ విరాగివలె మాయామోహములకు దూరంగా ఉంటాడు. ప్రపంచ విషయాల పట్ల ఆసక్తి కనబఱచడు. మనసును కేంద్రీకరించడానికి విరక్తుని వలెనే భక్తుడు కూడా ప్రభువువైపు ఉన్ముఖుడౌతాడు.

సూరదాసుకు ఇష్టదైవం శ్రీకృష్ణుడు. పరమేశ్వర కృష్ణుని బాల్యరూపం మరియు కిశోరరూపం సూరదాసుమనసుకు అత్యధికంగా రుచించాయి. సూరదాసు స్వాభావికంగా నివృత్తి మార్గకవి. కాని శ్రీవల్లభుని ఉపదేశం పొందిన తరువాత అతడు అనుసరించిన భక్తిమార్గం శుష్కమై, నీరసమై, కఠోరమై, అసిధారావ్రతమైన నిర్గుణ మార్గమును వీడి ప్రవృత్తి మార్గమును అవలంబించాడు. సూరదాసు కృష్ణుడు కనుల ముందు ఆటలు ఆడి పాటలు పాడి జనజీవనంతో కలిసి పోయే సామాన్య మానవుడు. కాని ఆపద వచ్చినపుడు మాత్రం అలౌకిక లీలలు,

మహాత్ములు ప్రదర్శించి ప్రజలను ఆదుకునే ఆప్తమిత్రుడు. అతని లీలలలో నిమగ్నుడై వర్ణనలు చేస్తూ, గుణగానం చేస్తూ జీవించడమే భక్తుని పరమావధి. మోక్షంగాని తద్వారా పొందే బ్రహ్మానందంగాని అత్యంతంకాదు. అలా అని సూరదాసు భక్తి తత్త్వవివేచన శాస్త్రచింతన చేయలేదని కాదు. మర్యాదను కాదని ఉచ్ఛృంఖలతను భక్తి పేరిట ప్రచారం చేశాడనీ కాదు. సకామ భక్తి నిష్కామ భక్తి అని భక్తి రెండు విధాలు. సాధకుడు సకామభక్తి ద్వారా క్రమశః వికాసం పొంది నిష్కాముడై జననమరణ చక్రం నుండి బయట పడతాడు. సూరసాగరంలో భక్తి రసామృత ధారలోని వివిధలహరుల చర్చ గావించబడింది. వైరాగ్యపూర్ణభక్తి వైధీ భక్తి (నవవిధభక్తి), ప్రేమరూప భక్తి పుష్టిమార్గీయ భక్తి. అద్వైతమూలకమైన భక్తి మరియు భక్తిమార్గములనెన్నిటినో కూలంకషంగా చర్చించాడు. సర్వానర్థాలకు కారణభూతమైన కామ నను త్యజించమన్నాడు, నిర్వేదము, వైరాగ్యము, దైన్యము, వినయము మొదలగు భావనలతో ప్రేరితుడై అనే కపదాలు రచించాడు.

వైధీభక్తికి అనుగుణంగా భక్తశిఖామణి సూరదాసు శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, వందనం, అర్చనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం, అనే నవవిధాల భక్తిని అనేక పదాలలో తనివితీర, వర్ణించాడు. భక్తపోతన వలెనే[1]

---

1 కమలాక్షు నర్చించు కరములు, కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ,
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు, శేషశాయికి మ్రొక్కు-
శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు, వీనులు మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు, పురుషోత్తమునిమీది బుద్ధి బుద్ధి
దేవదేవుని చింతించు దినము దినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి! హరిజేరు మనియెడి తండ్రి తండ్రి.

—శ్రీ మహాభాగవతము 7-169.

సూరదాసు హరికీర్తన చేయని శరీరంలోని వివిధ అంగాలకు సార్థకత లేదన్నాడు.

సోయి రసనా, జో హరిగున గావై ।
నైననికీ ఛవి యహైచతురతా, జౌ ముకుంద్‌మకరందవా ధ్యావై॥
నిర్మల్ చిత్తతాఁ సోయిసాంచా కృష్ణబినా జిహిఁ ఔర్ న భావై।
శ్రవనని కీజు యహై అధికాయీ, సుని హరికథా సుధా రస్ పావై॥
కర్ తేయీ జై స్యామహిఁ సేవై చరనని చలి వృందావన్ జావై।
సూరదాస్ జైయే బలివాకీ, జో హరి జూసౌఁ ప్రీతి బఢావై॥
—సూరసాగర్, 350,

జప తప వ్రతముల కన్న, యజ్ఞ యాగాదులు చేయుటకన్న తీర్థయాత్రలు చేయుచు, పుణ్యజలముల మునుగుటకన్న హరిలీలల శ్రవణమనన కీర్తనాదులలో లీనమై జీవించుటయే మేలని సూరదాసు మోక్షమక్కఱలేక నిత్య తృప్తుడై మెలగెను.

**దాస్య భావము**

పుష్టిమార్గంలో దీక్ష గైకొనక పూర్వం సూరదాసు దైన్య భావంతో రచించిన పదాలన్నిటా దాస్యభావం గోచరిస్తుంది. ఆచార్య వల్లభుడు ఏదో ఒక పదం వినిపించమని అడిగినప్పుడు సూరదాసు ఈ క్రింది పదం వినిపించాడట.

ప్రభు హౌఁ సబ్ పతితన్ కౌటీకౌ।
ఔర్ పతిత్ సబ్ దివస్ చారికే, హౌఁతౌ జనమత్‌హీకౌ॥
బధిక్, అజామిల్, గనికా తారీ ఔ పూతనా హీకౌ।
మోహిఁఛాఁడి తుమ్ ఔర్ ఉధారె, మిటే సూత్ క్యోఁజీకో॥

కోఉన సమరథ్ అఘ్ కరిబెకౌం, ఖైంచి కహాత్ హౌం లీకో।
మరియత్ లాజ్ సూర్ పతితనిమేం మోహుం తైంకో నీకో।
—సూర్‌సాగర్, 238

ఈ పదంలో భగవానుడు ప్రభువు, స్వామి. సూరదాసు సేవకుడు. కృపాయాచన చేస్తున్నాడు. దీనిలో అనన్యభావం ఇమిడి ఉంది. సూరదాసంటాడు-నేను పతితులందరిలో శ్రేష్ఠుడను. నా కంటె పాపాలు చేయగల సమర్థుడు మరొకడు లేడు. పందెం కాయ మంటాడు. మంచినో చెడునో నేను నీ వాణ్ని అని మొర పెట్టుకుంటాడు. మరోచోట అందరూ నన్ను నీగులాము నంటారు. నన్ను కొనుక్కొని వచ్చావని తూలనాడుతారు. అన్నింటినీ సహించడమే కాదు. నేను స్వీకరిస్తున్నా నంటాడు. తనను స్వీకరించమని వేడుకుంటాడు, అత్యున్నత మైన భక్తి భావన.

సూరదాసు తన మనసు విప్పి చదువుకుంటాడు. తనస్వభావ చర్చ చేస్తాడు. తన మనసుకు ఇంకేదీ రుచించదట. నడిసముద్రంలో నడిచే ఓడపై పక్షి తిరిగి తిరిగి మరల ఓడపైనే వ్రాలుతుంది. అదేవిధంగా సూరదాసు మనసు ప్రపంచమంతా తిరిగినా గమ్యస్థానం శ్రీహరి చరణాలే కదా అంటాడు.

మేరో మన్ అనత్‌కహాం సుఖ్ పావై।
జైసైం ఉడి జహాజ్‌కా పంఛీ, ఫిరి జహాజ్‌పర్ ఆవై॥
కమలనైన్ కౌఛాడి మహాతమ్, ఔర్ దేవకౌం ధ్యావై।
పరమగంగకౌఛాండి పియాసో, దురమతి కూపఖనావై॥
జిహిమధుకర్ అంబుజరస్ చాఖ్యో, క్యోంకరీల్ ఫల్‌ఖావై।
సూరదాస ప్రభు కామధేనుతజి, ఛేరీ కౌన్ దుహావై॥

ఈ పదం చదివిన వెంటనే తెలుగు పాఠకులకు తేనెలూరించు పోతన పద్యం "మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు వోవునే మదనములకు" అనేది స్ఫురించక మానదు.

సూరదాసు దాస్యభావమును దీనత, మానమర్షత భయదర్శనము, భర్త్సన, ఆశ్వాసనము, మనోరాజ్యము' మరియు విచారణ అనే ఏడు భూమికలలో వర్ణించి దాస్యభక్తిని నిరూపించాడు.భూమికలకు ఉదాహరణలు మాత్రం ఉట్టంకిస్తాను. ప్రపంచపు పక్షి సంసార వృక్షంపై కూర్చుంది. వ్యాధ రూపుడైన యమరాజు మాయారూపమైన శరమును సంధించి యున్నాడు. భగవానుని స్మరణరూపమైన సర్పము వ్యాధుని కరచి రక్షించాలని భక్తుని ఆకాంక్ష

అబ్ కై రాఖ లేహు భగవాన్।
అనాథ్ బైఠ్యో ద్రుమడరియా, పారధి సాధే బాన్॥
తాకేం డర్ మైం భాజ్యో చాహత్, ఊపర్ ఢుక్యో సచాన్
దుహుం భాంతి దుఖ్ భయో, ఆనియహ్ కౌన్ ఉబారే
ప్రాన్?
సుమిరత్ హీ అహి డస్యోపారధీ, కర్ ఛూట్యో సంధాన్।
సూరదాస సర్ లగ్యో సచానహిం జయ జయ కృపానిధాన్॥
సూరసాగర్—97

భక్తుడు తన మనసులో ఒక సర్వాంగసుందరమైన. కల్పనాలోకాన్ని నిర్మించుకుంటాడు. ఎన్నో ఆశలు పెంచుకుంటాడు వాటిని సాధించడానికి ఇష్టదేవుని ప్రార్థించుకుంటాడు. లౌకికమైన దేహగేహ భావనను వదలి పరలోక మనే కల్పిత లోకంలో ఇష్టదేవుని సాలోక్య సామీప్య లాభం కోర్తాడు. ఆ లోకంలో దర్శన, స్పర్శన లాశిస్తాడు. తానూ ఒక పాత్రధారియై అచట విహారం కాంక్షిస్తాడు. చివరికి తాను ఏదైనా వస్తురూపంలోనైనా అచట చేరాలనుకుంటాడు. పుష్టి సంప్రదాయంలో గోలోకవాసన కల్పన భక్తుని మనోరాజ్యమే. సూరదాసు ఒక మెట్టు పైకి వెళ్ళి రేపల్లె వీధులలో, గొల్లభామల ముంగిళ్ళలో పారవేసిన విస్తళ్లలోని మెతుకులు ఏరుకు తిని కుక్షి నింపుకోవడంలో ధన్యత నొందుతాడు.

అచ్చట పొదరిళ్ళలో తిరుగుతూ యమునా జలమును గ్రోలుతూ జీవితం సార్థకం చేసుకోవాలనుకుంటాడు.

ఐసై బసియే వ్రజకీ వీథిని।
గ్వారనికే పన్‌వారె చుని-చుని ఉదర్ భరిజై సీథిని॥
పైండేకే సబ్ వృచ్ఛ-బిరాజత్ ఛాయా పరమ పునీతని।
కుంజకుంజ ప్రతి లోటిలోటి బ్రజ రజ్ లాగై రంగ్ రీతని॥
నిసి దిన్ నిరఖి జసోదానందన్ అరు జమునా జల్ పీతని।
పరసత్ సూర్ హోత్ తన పావన్, దరసన్ కరత్ అతీతని॥

—సూరసాగర్ 1108

ఆ తర్వాత బృందావన రేణువై శ్రీకృష్ణ సంగతిలో ఆడుతూ పాడుతూ ఇచ్చిపుచ్చుకోవడాలు లేని లోకంతో వ్రజపురి వాసుల ఎంగిలితో తృప్తిపడాలని కోరుకుంటాడు.

ధని యహ వృందావన్ కీ రేను।
నందకిసోర్ చరావత్ గైయాం, ముఖహి బజావత్ వేను।
మన మోహన్ కో ధ్యాన్ ధరై జియ, అతి సుఖ పావత్ చైను।
చలత్ కహా మన్ ఔర్ పురీతన జహాం కఛలైన్‌న దైను।
ఇహాం రహహు జహం జూని పావహు వ్రజవానిసికైఘాను.
సూరదాసుహ్యా కీ సర్‌వరి గహికల్ప వృచ్ఛ సురధైను॥

పోతనామాత్యుడు గోపికల మిషతో ఇట్టి మనో రాజ్య కల్పన చేశాడు.

వేణు నాదములమై వెలసిన మాధవుండధరామృతము లిచ్చి యాదరించు.
బింఛధామములమై పెరిగిన వెన్నుండు మస్తకంబున దాల్చి మైత్రి నెరపు

పీతాంబరములమై వెలసిన గోవిందు డంసభాగముల బాయక
ధరించు

వైజయంతికలమై వ్రాలిన గమలాతు డతి కుతూహలమున
నలుత దాల్చు.

దనరు బృందావనంబున దరులమైన
గృష్ణు డానందమున జేరి క్రీడ సల్ప
నెట్టినోముల నయిన మున్నిట్టి విధము
లేల కామైతి మోయమ్మ! యింక నెట్లు.

—శ్రీ మహా భాగవతము 10/1352

ప్రపంచపు నిస్సారతను గూర్చి చింతన చేయుచు వైరాగ్య భావనతో నిర్లిప్తుడై జీవనం గడపడం విచారణ మనబడుతుంది. సూరదాసు శరీరపు వికృతులను గూర్చి చర్చించాడు. ప్రాణపక్షి ఎగిరిపోయిన మరుక్షణము శరీరము అనే తరువు యొక్క ఆకులన్నీ రాలిపోతాయి. అందచందాలకై గర్వించేవాని శరీరమును కాకులు గ్రద్దలు తింటాయి. క్రిమికీటకాదులు మేస్తాయి. ప్రేమనెరపే వారంతా అసహ్యించుకుంటారు. కావున జన్మను వృథాచేయక భగవద్భజన చేయుమని సూరదాసు ఆత్మప్రబోధం చేస్తాడు. భవబంధాల నుండి ముక్తిని కాంక్షిస్తాడు, ఇదే దాస్యభావనకు దైన్యతకు మూలం.

జాదిన మన పంఛీ ఉడీ జైహై।
తాదిన తేరే తన తరువర్ కే సబై పాత ఝురి జైహై ॥
యాదేహీ కా గరబ్ న కరియై, స్యార్ కార్ గిధ్ ఖైహై।
తావనిమై తన కృమి, కై విష్ఠా, కై హ్వై ఖాక్ విడైహై।
కహాఁ వహనీర్ కహాఁ వహ్ శోభా, కహఁ వహ్ రంగ్
రూప్ దిఖైహై

*   *   *

జిన్ లోగని సౌం నేహ కరత్ హై, తేయీ దేఖిఘినై హై॥
సూరదాస భగవంత భజన బిను వృథా సుజనమ్ గవై హై.
—సూరసాగర్ 86

ఈ విధంగా సూరదాసు దాస్యభావనలోని అనేక భూమికలలో విహరిస్తూ పదాలను రచిస్తూ తన్మయత్వంలో కాలం గడిపాడు. అంతేగాక తన సూరసాగరంలోని ఈ దాస్యభక్తి వీచికలో నేటికిని ప్రజలను ఓలలాడింప జేస్తున్నాడు.

**సఖ్యభావము:-**

ఉపాస్యుని భక్తుడు సఖుడుగా భావించి అహేతుకమైన ప్రేమ పూర్ణ వ్యవహారం చేయడం సఖ్యభక్తి అనబడుతుంది. ఇష్టదేవునికి అంతరంగసఖుడుగా ప్రేమమయమైన నిస్స్వార్థమైన భావము కలిగి ఉండడం దీనిప్రధాన లక్షణం. శ్రీమద్భాగవతంలో అట్టి వారిని ధన్యులని వేనోళ్ళ కీర్తించబడింది. బ్రహ్మ శ్రీకృష్ణస్తుతి చేస్తూ అంటాడు-

అహో భాగ్య మహో భాగ్యం నంద గోప వ్రజౌకసాం।
యన్మిత్రం పరమానందం పూర్ణ బ్రహ్మ సనాతనమ్॥
—శ్రీమద్భాగవతము, దశమస్కంధము.
అధ్యాయం 14, శ్లోకం 32.

సూరసాగరంలో బాలలీలలు, గోచారణము కుచేలుని దారిద్ర్యనివారణము మొదలగు ప్రసంగములలో సఖా భావవర్ణన అత్యంతరామణీయకంగా చేయబడింది. హరిలీలలకు సంబంధించిన అన్ని పదాలు సఖాభావములోకే వస్తాయి. కారణ మేమంటే హరిలీలలలో భక్తులంతా సఖాభావంతో పరమ పురుషుని జేరి ఆనందిస్తారు. సూరదాసు వినయపదాలలోనే సూక్ష్మంగా సఖ్యా భావం గోచరిస్తుంది. శ్రీవల్లభాచార్యులచే దీక్ష పొందిన

తరువాత ఈ భావము పరిపుష్టమై, తీవ్రమై, గాఢమై, అతిశయత నొంది పరిణతదశకు చేరింది.

పుష్టి సంప్రదాయంలో సఖ్యభావమునకు విశిష్ట స్థాన ముంది. సాంప్రదాయానుసారంగా అష్టసఖు లున్నారని ప్రతీతి. వారే 'అష్టఛాప్' కవులని ప్రసిద్ధి పొందారు. వీరంతా సఖ్య భావం పొందిన కవులే. వీరు కృష్ణసఖులని పిలువబడ్డారు. సూరదాసు 'కృష్ణసఖు' డనియు, పరమానందదాసు 'ఖోక్' అనియు, కుంభనదాసు 'అర్జును' డనియు, కృష్ణదాసు 'ఋషభు' డనియు, చతుర్భుజదాసు 'విశాలు' డనియు, నందదాసు 'భోజు' డనియు, ఛీతస్వామి 'సుబలు' డనియు, మరియు గోవింద స్వామి 'శ్రీదాము' డనియు ప్రసిద్ధి పొందారు. ఆయా పేర్లతో వారు ఆరాధ్యునితో వివిధ క్రీడలలో లీలలలో, పాల్గొని తరించారు.

సూరసాహిత్యంలో కృష్ణునితో సఖాభావంతో నానావిధ క్రీడలు సల్పినట్లు, వినోదించినట్లు అనేక పదాలలో వర్ణన జరిగింది. బాలచేష్టలు, స్పర్ధభావనల చిత్రణ ఒక విశేషం. శ్రీదాముడు శ్రీకృష్ణునికి ప్రతిద్వంద్విగా నిలుస్తాడు. చేతిలో చేయి వేసి కృష్ణుడు పరుగు తీస్తాడు. శ్రీదాముడు అతన్ని పట్టుకోవాలి. ఇది చిత్రమైన సన్నివేశం. ఆత్మపరమాత్మల దాగుడు మూతలాట. మధ్యలో జగడము లాడతారు. శ్రీకృష్ణునికి కోపం వచ్చి ఆట పెట్టకుండా పారిపోతాడు. శ్రీదాముడు సూటి పోటి మాటలాడి కృష్ణుని రెచ్చగొడతాడు కులంలో మేము తక్కువేంకాదు. తరువాత మేము నీ పంచన బ్రతకడం లేదని వాదిస్తాడు. మాకన్న కొన్ని ఆవులు ఎక్కువ ఉన్నాయని అధికారం చేస్తున్నావు. మహా నీ గొప్పేమిటి అని ప్రశ్నిస్తాడు.

ఖేలత్ మేం కో కాకో గుసయియ్యాం॥
హారి హారే జీతే శ్రీదామా బర్ బస్ హీ కత్ కరత్
రిసయియాం ॥
జాతి పాంతి తుమతే కఛునాం హీన బసత్ తుంహార
ఛయియాం ॥

అతి అధికార జనావత్ యాతేఁ అధిక్ తుంహారే హైకఛు
గయియాఁ ॥
—సూరసాగర్, 863.

భక్తుడు భగవానుని నిలదీసి అడిగే స్వాతంత్ర్యం నేటికి ఏదోవిధంగా కనిపిస్తుంది. అయితే కొందరు సాధకులు మిత్ర భావంతో, మరి కొందరు అమిత్రభావంతో నిలవేస్తారు. ఇచ్చట నారద 'భక్తి సూత్రం 'నాస్తిరూపకుల జాతిక్రియ భేదాత్' ను అక్షరాల సూరదాసు నిరూపించాడు. ఈ ఆట పోటీలోనే కాళియ మర్దనం సహజంగా సంభవిస్తుంది.

శ్రీకృష్ణుడు ఆలమందల మేపుతూ మిత్రులతో కూడి వనంలో అల్పాహారం చేస్తాడు. యశోదమ్మతల్లి వివిధ వ్యంజనములు, షడ్రస పక్వాన్నములు ప్రేమతో చద్ది కట్టింది. గోపులు గొల్ల పిల్లలు వింతచేష్టలతో హాసపరిహాసాలతో వాటిని భుజిస్తారు. ఎంగిలి ముద్దలు లాగుకొని తిని ధన్యత పొందుతారు.

గ్వాలని కరతైఁ కౌక్ ఛుడావత్॥
జూఠా లేత్ సబనికే ముఛ్ కా అపనే ముఖులై నావత్

*　　　*　　　*

యహ్ మహిమా యేయీపై జానత్, జాతైఁ ఆపు బంధావత్॥
సూర స్యామ్ సపనైఁ నహీఁ దరసత్, ముని జనధ్యాన లగావత్॥
సూరసాగర్ — 1086

సూరదాసు రచించిన ఈ పదాలు మనకు పోతన్న పెట్టిన చద్దియన్నం, ఊరుగాయలు జ్ఞప్తికి తెస్తాయి.

మాటిమాటికి వ్రేలు ముడిచి యూరించుచు నూరుఁగాయలు
దినుచుండు నొక్క,
డొకని కంచము లోని డొడిసి చయ్యన మ్రింగి చూడు లేదని
నోరు చూపునొక్క...

సఖ్యభావము నందు మరొక ఉజ్జ్వల ప్రసంగము సుదామ చరిత్రము (కుచేలో పాఖ్యానము). బాల్యమిత్రుని, క్షీణగాత్రుని,

కుచేలుని భార్య తిరిగి వచ్చిన సుదాముని నీ మిత్రుడెలా సత్కరించాడని అడుగుతుంది. సుదాముడు మిత్రుని ఆప్యాయతను, ఆదర్శవ్యవహారమునుగూర్చి పొగడుతాడు. అతడుతప్ప దుఃఖనివారకుడు లేడనియు, ఆతని ప్రేమను మరువ లేననియు చెప్తాడు. ఇందు భక్తుని అనుభవము గోచరిస్తుంది. ఆతడు ధనసంపదలకై నోరైనా విప్పలేదు. అనంత శ్రీలనిచ్చి సత్కరించాడు. ఇచ్చట పరిశీలించదగిన విషయమేమంటే శ్రీదాముడు, సుదాముడు ఇరువురు ఒకేస్వభావము గలవారు కారు. భక్తి పద్ధతిలోనే మార్గాలు వేరైనాయి. సఖ్యభావమే అయినప్పటికీ ఒకరిది హాఠంతో అధికారం చేసే స్వభావం. మరొకరిది వినయము, సంకోచము మరియు గంభీరం.

శ్రీకృష్ణుడు పరమాత్మ, సఖుడు జీవాత్మ రూపంలో లీలలు సలిపారు. ఒకరు అగ్ని అయితే మరొకరు స్ఫులింగము ఉపనిషత్తులలో విస్తరించి యున్న సఖ్య భావమున కిది విస్తృతి, 'ద్వా సుపర్ణా సయుజా సఖాయా' (ముండకోపనిషత్తు-5-3-1) ననుసరించి మాయా ప్రపంచకారణమున బ్రహ్మమే జీవతత్త్వమయింది. పార్థివ శరీరంలో ప్రవేశించగానే జీవుడు కించిజ్ఞుడు, ఐశ్వర్యహీనుడుగా తలుస్తాడు. ప్రాపంచిక బుద్ధితోనే తాదాత్మ్యమును పొంది స్వస్వరూపమును మరచి అశక్యతనుపొందుతాడు. సఖ్యభావము వలన పరమేశ్వరుని చేరి సాలోక్య, సామీప్య, సారూప్యముక్తిని పొందుతాడు.

అర్జునుని సఖ్యభావము పేరెన్నదగినది. అర్జునునిపై అవ్యాజమైన ప్రేమ చేతనే శ్రీకృష్ణుడు మునికోల చేత బూని రథ సారథియైనాడు. సూరదాసు కృష్ణుడు ప్రతిజ్ఞ చేశాడు. భక్తుల శత్రువు తన శత్రువు అని చాటుతాడు.

హామ్ భక్తనికే భక్త హమారే,
సుని అర్జున్ పరతిజ్ఞా మేరీ, యహ్ వ్రత్ టరత్న టారై॥
భక్తని కాజ్ లాజ్ జీయధరికై, పాయి పియాదే ధావూం।

జహాఁ జహాఁ భీర్ పర్రై భక్తనికేఁ తహాఁ తహాఁ జాయి
ఛుడావ్రాఁ॥
జో భక్తని సోఁ వైర్ కరత్ హై, సో వైరీ నిజమేరో।
దేఖి విచారి, భక్తహిత కారన్, హాంకత్ హౌఁరథ్ తేరా॥
జీతైఁ జీతి భక్త అపనై కై, హారైఁ హారి విచారౌఁ।
సూరదాస్ సుని భక్తవిరోధీ, చక్రసుదర్సన్ జారౌఁ ॥

శ్రీకృష్ణుడు అవతారము చాలించిన తదుపరి వియోగమును సహించలేక అర్జునుడు గతస్మృతులను నెమరువేస్తూ విలపిస్తాడు. హరిలేక జీవించు టెట్లు? చేతులు నలుపుతూ.తల విపరీతంగా కదుపుతూ రోదిస్తాడు. చేతులు కాళ్ళు స్తంభించి పోయినాయి. పురుషార్థము లేదు. శంకరు డిచ్చిన పంచబాణము వృథా అయింది ఆతని బలంతోనే కదా శత్రునిర్మూలనం చేశాడు. మహాభారతం జయించాడు. హరి వరుడు లేక ఈ ప్రాణములు ఇక ఏస్వార్థము కొరకు నిలిచివున్నాయి. వెళ్ళి పోవేం అని రోదిస్తాడు.

హరి బిను కోపురవై మోస్వారథ్ ?
మీడత్ హాత్, సీస్ధుని ఢోరత్, రుదన్ కరత్ నృపపారథ్ ॥
థాకే హస్త, చరన్ గతి థాకీ, అరుథక్యో పురుషారథ్ ।
పాంచబాన్ మోహిఁ సంకర్ దన్హో కేవుగయే అకారథ్ ॥
జాకే సంగ్ సతే బంధ్ కీన్యోఁ, అరు జీత్యో మహాభారత్ ।
గోపీ హరి సూక్ కే ప్రభు బిను,రహత్ ప్రాన్ కిహిఁ స్వారథ్॥
సూరసాగర్ — 1–287.

ఈ సందర్భంలో వ్యాకులచిత్తుడై విలవిల లాడిపోతున్న పోతనామాత్యుని అర్జునుడు తెలుగువారికి స్ఫురిస్తాడు.

మన సారథి, మన సచివుడు,
మన వియ్యము,మన సఖుండు, మనబాంధవుడున్
మన విభుడు, గురుడు, దేవర
మనలను దిగనాడి చనియె మనుజాధీశా॥

—శ్రీమహాభాగవతము. 1/356.

ఉద్దామ జ్ఞానగర్విష్ఠియైన ఉద్ధవుడు శ్రీకృష్ణుని సంగడికాడు. గోపికలకు నిర్గుణ జ్ఞాన మార్గము నుపదేశింపబోయి పరమ ప్రేమో పేతుడైన గోపాల కృష్ణుని ప్రేరణమున గోపికల ద్వారా భక్తి మార్గదీక్షితుడై వ్రజవీథులలో పొరలి పొరలి ధూళిధూసరితుడై మధురకు తిరిగి వస్తాడు.

సఖ్యభావము నానాదిశలలో ప్రవహిస్తూ భగవానుని లీలలు అగమ్యగోచరము లయినప్పటికీ అనుభవైకవేద్యములని సూరదాసు నిరూపించాడు. మానవవేషధారణ చేసి వచ్చి మానవ సమాజంలో విహరిస్తూ ఆడి పాడి భక్తులను లాలించిన కారణముచేత ఆబాలగోపాలమునకు శ్రీకృష్ణుడు అత్యంతప్రియపాత్రుడైనాడు.

**ఆత్మనివేదన - ప్రపత్తి:-**

అనన్య భావముతో పరమారాధ్యుని ప్రార్థించుట, శరణు వేడుట, వైరాగ్య ప్రేరితుడై అరమరికలు లేక చేసిన తప్పులు ఒప్పుకొని పశ్చాత్తాపతప్తమనస్కుడై రక్షించుమనీ, భవ బంధములను త్రెంచివేయుమని వేడుకొనుట, ఆత్మనివేదనమనియు ప్రపత్తి యోగమనియు వ్యవహరింప బడుతుంది. దేవర్షి నారదుడు ప్రవచించిన ఏకాదశ ఆసక్తులలో ఆత్మనివేదనాసక్తి ముఖ్యమైనది. సూరదాసు పుష్టి మార్గ అనుయాయుడై గోపాలుడే సర్వస్వమని నమ్మి ఆతని ఆజ్ఞలేనిది ఏమియు ప్రాప్తించదని, సుఖదుఃఖములు వాని ప్రసాదమని స్వీకరించి స్తుతించాడు.

కరీగోపాల్ కీ సబ్ హోయి!

జో అపనో పురుషారథ్ మానత్, అతి ఝూఠా హై సోయి॥
సాధన మంత్ర జంత్ర, ఉద్యమ, బల యే సబ్ డారౌ ధోద్॥
జో కుఛ్ లిఖి రాఖీ నందనందన్, మేటి సకై నహిం కోయి॥
దుఃఖ, సుఖ, లాభ్ - అలాభ్ సముఝి తుమ్ కతహిం మరత్ హౌం రోయి॥
సూరదాస్ స్వామీ కరుణామయ, స్యామ్ చరన్ మన్ పోయి॥

శరణాగతి మార్గము శాస్త్రసమ్మతము. అనుకూల సంకల్పము ప్రతికూల వర్తనము, రక్షణలో విశ్వాసము, గోప్తృత్వ వరణము ఆత్మనిక్షేపము, కార్పణ్యము అను ఆరు అంగములలో సూరదాసు ప్రపత్తియోగమును వర్ణించాడు. సూరదాసు అత్యంతదీన చిత్తుడై అనంతుని శక్తి యుక్తులలో అమితమైన విశ్వాసమును ప్రకటిస్తూ అహేతుకమైన కృపను పొందుటకై శక్తి నంతటిని పొదివి పట్టుకొని ఆర్తనాదం చేశాడు.

జబ్ - జబ్ దీనని కఠిన పరీ!
జానత్ హౌం కరునామయ జనకౌం తబ్ తబ్ సుగమ్ కరీ॥
*    *    *
తబ్ - తబ్ రచ్ఛా కరీ భగత్ పర్ జబ్ - జబ్ విపతి పరీ॥
మహామోహ్ మైం పరయో సూర్ ప్రభు, కాహై సుధిబిసరీ?
—సూర్‌సాగర్ 16

ఈ సందర్భంలో గజేంద్రుని పిలుపు రూపంలో ఉన్న బమ్మెర పోతనామాత్యుని పద్యం స్ఫురిస్తుంది.

లా వొక్కింతయు లేదు, ధైర్యము విలోలం బయ్యె,
ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛ వచ్చె, తనువున్ డస్సెన్,
శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెరుగ మన్నింపందగున్, దీనునిన్
రావే ఈశ్వర, కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా.
—శ్రీమహాభాగవతము, 8-90

ఉపాస్యున కధీనుడై తనసర్వస్వమును సర్వాత్మనా సర్వభావేన సమర్పించుకొని నిశ్చింతుడై నిర్మలచిత్తుడై జీవితము గడుపు సమర్పణ బుద్ధిని ఆత్మనిక్షేప మంటారు. 'త్యాగే నైకే అమృతత్వ మానశుః' ను సార్థకం చేస్తూ సూరదాసు సర్వసంగ పరిత్యాగము జేసి భగవద్భజనలో లీనమైనాడు.

మేరీ కౌన్ గతి వ్రజనాథ్ ?
భజన విముఖ్ అరు సమనాహీఁ, ఫిరత్ విషయని సాథ్॥
హౌఁ పతిత్, అపరాధ్, పూరన్ భరయౌ కర్మవికార్ ?
కామక్రోధ అరు లోభచితదౌఁ, నాథ్ తుమహీఁ బిసార్।
ఉచిత్ అపనౌ కృపాకరిహౌ. తబైతౌ బనిజాయి।
సోయి కరహు జిహీఁ చరుసేవై సూర్ జూఠని ఖాయి॥

**పుత్ర భావము:**

భక్తుడు తన ప్రభువును తల్లిగా భావించి తనను వడిలోని బిడ్డగా భావిస్తాడు. భక్తి క్షేత్రంలో ఈ భావం వైదికకాలంనాటి నుండీ వస్తున్నదే. మర్కట న్యాయరీతి భక్తుడు నిశ్చింతుడై ఉంటాడు. సూరదాసు రచనలో సాధకుడు పుత్రభావంతో అపరాధము లన్నిటిని క్షమించమని, జఠరములో పెరుగుతున్న శిశువు చేసిన తప్పులను. తల్లి సరకు చేయక ప్రేమిస్తుందని అనునయ వినయం ప్రదర్శిస్తూ వాదిస్తాడు.

1. అపనే కో కౌన్ ఆదర్ దేయి !
   జ్యోఁ బాలక్ అపరాధ్ కోటికరై మాతున మానై లేయి!
   సూరసాగర్ -200,

2. మాధవు జో జనతై బిగరై!
   తఊ కృపాలు కరునామయ కేసవ ప్రభునహీఁ జహిధరై॥
   జైసై జనని జఠర అంతరగత్ సుత్ అపరాధకరై॥
   తఉపుని జతన్ కరై అరుపోసై నికసై అంక్ భరై॥
   సూర్‌సాగర్, 117,

ప్రభువు జీవకోటిని ఇదే విధంగా తన గర్భంలో ధరించి ఉన్నాడు. ఆతని సంతానం నానారకాల ఉత్పాతాలు సృష్టిస్తుంటుంది కాని వీరిలో ఎవరైతే ప్రభు శరణు వేడుతారో వారు ప్రీతి పాత్రులై తరిస్తారు.

## వాత్సల్య భావము

సూరదాసుకు ఆరాధ్యుడు బాలకృష్ణుడే. అందుచేతనే శ్రీకృష్ణుని పూర్వార్ధ జీవితం పైనే శ్రద్ధచూపించాడు. బాలసహజమైన చేష్టలు, మనో భావనల వర్ణనలో సూరదాసు అమితానందం పొందాడు. బాల కృష్ణుని ప్రతిభావసంచలనను, క్రీడను ప్రతి చిన్న సంఘటనను వర్ణిస్తూ తన్మయుడౌతాడు. శిశు జీవితం యొక్క ప్రతి భావమును, ప్రతి దృశ్యమును, సహజ సుందరంగా చిత్రించాడు. వాత్సల్యసాగరం యొక్క ప్రతి అంచును తలచి - తలచి అనుభవించాడు. బాలుడు దైవానికి ప్రతినిధి. అతని సమీపం చేరినవాడు స్వర్గ సుఖముల కన్న మిన్నయైన ఆనందమును అనుభవిస్తాడు. ఇచ్చట ఆసర్వేశ్వరుడే బాలుడై సూరదాసు వడిలో చేరాడు. అతడు సౌందర్య నిధి. మాతృత్వం నిస్స్వార్థ భావనతో బాలున్ని సేవలు చేస్తుంది. సూరదాసు కిట్టి మాతృహృదయం లభించింది. అతడు బాలకృష్ణుని మరియు యశోద యొక్క భావనలను సర్వజనీనంగా (యూనివర్సల్) చిత్రించాడు. అవి చిరంతనమూ, సత్యమూ అయినవి. వివిధ మానసిక స్థితులు మానవ భావనా చరిత్రలో నిత్యనూతనంగా విలసిల్లుతాయి. బాలుడై ప్రతి చిన్న విషయాన్ని సూక్ష్మంగా దర్శించి పాఠకుల ముందుంచాడు. మనోవైజ్ఞానికదృష్టితో బాలప్రవృత్తులను రసదశ వరకు తీసుకురావడం సామాన్యకవులకు సాధ్యం కాని పని. ఈ సందర్భంలో సూరకావ్యం విశ్వసాహిత్యంలో సూరదాసుకు సరితూగు కవి కానరాడు.



అంధకార బంధురమైన ఈ ప్రపంచంలో జ్యోతి స్వరూపుడైన శ్రీ కృష్ణుడు జన్మించాడు. దేవకీనందనుడు యశోదకు సర్వస్వమయ్యాడు. కారాగారంలో భైరవరాగం మ్రోగింది. రేపల్లెలో విజయదుందుభి మ్రోగింది. చిమ్మచీకటిలో చల్లని చంద్రుడు దర్శనమిచ్చాడు. ఆనంద జలధిలో సూరదాసు మునకలు వేశాడు. నందుడు పుత్రోత్సవం చేశాడు. యశోద పులకితురాలైంది. గోపికలు ఆనందంతో చిందులు వేశారు. సురలు పుష్పవర్షం కురిపించారు.

రాక్షసులు జడుసు కున్నారు. చేతనం ఉరుకు లాడింది. అర్ధచేతనమైన ధేనువులు దుగ్ధధారలు వర్షించాయి. అచేతనమైన యమున ఆనంద సరోవరమై తరంగాయితమైంది. వృక్షములు నవపల్లవములతో చిగురించాయి. వనలతలు నవకుసుమములతో అలంకరించు కున్నాయి. విప్రులు, సూతులు, మాగధులు మరియు యాచకులు ఉత్సాహంతో స్తుతించారు. ఆశీర్వదించారు. నందుడు అందరినీ సత్కరించాడు. దృశ్యం కనులముందు చిత్రించబడింది.

ఆజు నంద్ కే ద్వారేఁ భీర్।
ఇక్ ఆవత్, ఇక్ జాత్ బిదాహ్వై, ఇక్ ఠాడె మందిర్ కై తీర్॥
కో ఊ కేసరి కౌ తిలక్, బనావతి కో ఉపహిరతి కంచుకీ సరీర్।
ఏకనికౌఁ గోదాన్ సమర్పిత్, ఏకనికౌఁ పహిరావత్ చీర్॥
ఏకనికౌఁ భూషన్ పాటంబర్, ఏకనికౌఁ జుదేత్ నగహీర్॥
ఏక్ కౌఁ పుహుపునికీ మాలా, ఏకనికౌఁ చందన్ ఘసినీర్॥
ఏకని మాథై దూబ్-రోచనా ఏకనికౌఁ బోధతి దై ధీర్।
సూరదాస్ ధనిస్యామ్ సనేహీ ధన్యజసోదా పున్యసరీర్॥

సూరసాగర్—10/25

వాత్సల్య భావమునకు ఆశ్రయములు నందయశోదలు. వేదముల యొక్క ఋచాస్వరూపలైన గోపాంగనలు, పూర్వ జన్మలో ఋషులు గోపికల రూపములలో అవతరించిన వారైన పుణ్యచరితలు, మాతయశోద శిశువైన కృష్ణునికి స్తన్యపానము చేయిస్తూ జోకొట్టి నిద్రపుచ్చుతున్న దృశ్యం అత్యంతవాత్సల్య భావస్ఫోరకమై యున్నది.

జసోదా హరిపాలనై ఝులావై।
హలరావై, దులరాయి మల్హావై, జోయిసోయికచు గావై॥
మేరేలాల్‌కో ఆఉనిదరియా, కాహైన ఆని సువావై।
తూకాహై నహిఁ వేగహిఁ ఆవై, తోకో కాన్హ బులావై॥

కబహుఁక్ పలక్ హరి మూంద్ లేత్ హైఁ, కబహుఁ అధర్ పరకావై॥
సోవత్ జాని మౌన్ హైఁ కై రహి కరికరి సైన్ బతావై।
ఇహిఁ అంతర్ అకులాయి ఉఠే హరి జసుమతి మధురై గావై
జో సుఖ్ సూర్ అమర్-ముని దుర్లభ్, సోనంద భామిని పావై॥
సూరసాగర్ 10/43

చిన్నికృష్ణుడు పెద్ద పెద్ద రాక్షసులను హత మార్చాడు. ప్రతిసారి యశోద హృదయం వ్యాకుల పడుతుంది. తన ముద్దుల బిడ్డడికి ఏమైందోనని దిష్టితీస్తుంది. మంత్రం వేయించి తాయత్తులు కట్టిస్తుంది. పూతనవధానంతరం యశోద హృదయం సూరదాసు వర్ణిస్తాడు.

జసుమతి వికల్ భయీ ఛిన్ కలనా।
లేహు ఉఠాయి పూతనా డర్ తైఁ, మేరో సుభగ్ సాఁవరో లలనా॥
గోపీలై ఉఠాయి జసుమతి కౌఁ దీన్యో అఖిల్ అసుర్ కేదలనా।
సూరదాస ప్రభు కోముఖ్ చూమతి, హృదయలాయి పైఠాయే పలనా॥
సూరసాగర్-10,53

వాత్సల్య భక్తి అత్యంత ప్రధానమైంది. బాల్య దశలో కృష్ణుడు తన మధుర లీలలతో, శారీరక చేష్టలతో, చిలుక పలుకులతో బాలహాసంతో నందయశోదలకు ఆనందం ప్రసాదిస్తాడు. మనో వైజ్ఞానిక దృష్టితో జూచినచో వాత్సల్యభావము తదితర భావము లన్నింటి కన్న మిన్న యనిపిస్తుంది. కారణం దీనిలో స్వార్థగంధము లేశమైన లేకపోవుటయే. ఇది నిష్కామభక్తికి పోషకము. ఇది అత్యంత వ్యాపకమైన భావము. ప్రాణికోటి కిది జన్మజాత ప్రవృత్తి.

సూరదాసు వాత్సల్యభావము విశ్వసాహిత్యములో విశిష్టస్థానము నాక్రమిస్తుంది.

ప్రతి పిల్లవాని తల్లి వలెనే యశోద కోరుకుంటుంది. తన బిడ్డడు ఎప్పుడు పలుకుతాడో, ఎప్పుడు తప్పటడుగులు వేస్తాడో, ఎప్పుడు నడుస్తాడో, బోసిగా నవ్వు నెప్పుడో నని ఉవ్విళ్ళూరుతుంది. సూరదాసు కంఠంలో వాత్సల్యం నిండిన దృశ్య మిది.

జసుమతి మన్ అభిలాష్ కరై।
కబ్ మేరౌ లాల్ ఘుటురువన్ రేంగై, కబ్ ధరనీ పగ్ ద్వైక్ ధరై॥
కబ్ ద్వైదాంత్ - దూధ్ కే దేఖౌ, కబ్ తో తరైఁ ముఖ్ వచన్ ఝరై।
కబ్ నందహిఁ బాబాకహి బోలై కబ్ జననీ కహి మోహి రరై॥
కబ్ మేరౌ అంచరాగహి మోహన్, జోయి - సోయి కహి మోసౌఁ ఝగరై।
కబ్ దౌఁ తనక్ తనక్ కఛుఖై హై, అపనే కర్ సౌఁ ముఖహి భరై।
కబ్ హఁసి బాత్ కహై గో మోసౌఁ, జా ఛవితైఁ దుఖ్ దూర్ హరే।

—సూరసాగర్-10/76

తల్లి కోరిక తీరే ఘడియ రానే వచ్చింది. చిన్నికృష్ణుడు తప్పటడుగులు వేస్తూ నడుస్తున్నాడు. మణిమయ స్తంభములో తన ప్రతిబింబమును పట్టుకో ప్రయత్నిస్తున్నాడు. ఆ నవ్వులో రెండు కోరలు తెల్లగా మెరుస్తున్నాయి. తల్లి నందుని పిలిచి కొడుకు చేష్టలను గూర్చి ఎంతో మురిపెంతో చెప్పుతుంది.

కిలకత్ కాన్హ ఘుటురువని ఆవత్।
మనిమయ కనకనందకే ఆంగన్, బింబ్ పకరిబై ధావత్॥
కబహుఁ నిరఖిహరి ఆపుఛాఁహకౌఁ, కర్ సౌఁ పకరన్ చాహత్।

కిలకత్ హాఁసత్ రాజత్-ద్వైదఁతియా పుని-పుని తిహి అవగాహత్॥

*    *    *

బాలదసా సుఖ్ నిరఖి జసోదా, పుని పుని నంద్ బులావతి।
అంచరా తర్ లై ఢాఁకి, సూర్ కే ప్రభుకాఁ దూధ్ పియావతి॥

సూరదాసు బాల కృష్ణుని ముఖము, కన్నులు, భుజములు, కాళ్ళు, చేతులు, వేళ్ళు, నఖములు, కేశములు మొదలగు వాని అంగాంగసౌందర్యములో తన్మయుడై వర్ణించాడు.

సోభిత్ కర్ నవనీత్ లియే।
ఘుటురన్ చలత్ రేను తన మండిత్ ముఖ్ దధిలేప్ కియే॥
చారుకపోల లోలలోచన్ గోరోచన్ తిలక్ దియే।
లట్ లట్ కని మను మత్త మధుప్‌గన మాదక్ మధుహిఁ పియే॥
కఠురాకంఠ్, వజ్రకే హారినఖ్ రాజత్ రుచిర్ హియే।
ధన్య సూర్ ఏకౌ పల్ హారిసుఖ్ కాసత్ కలప్ జియే॥

—సూరసాగర్-10/717

కృష్ణుని చేత వెన్నముద్ద ఉంది. మోకాళ్ళ బలంతో నడుస్తున్నాడు. అందువల్ల శరీర మంతా దూళిధూసరితమై ఉంది. ముఖ మంతా పెరుగు పులుముకున్నాడు. చెక్కిళ్ళ అందం నేత్రముల చందం, నొసట తిలకం చూడముచ్చటగా ముద్దు గొలుపుతున్నాడు. ఉంగరాల జుత్తు ముఖమును కప్పుతోంది. మత్తెక్కిన మధుపగణము మధురసపానం చేస్తున్నట్టుగా ఉంది. కంఠమున కంటె ఉంది. అందు వజ్రము, సింహనఖము చెక్కబడి వక్షస్థలమున శోభిల్లుతోంది. ఈ సౌందర్యమును దర్శించిన ఒక్క క్షణం చాలు అంటాడు సూరదాసు, నూరుకల్పముల జీవిత మెందుకు వ్యర్థ మంటాడు.

ఆచార్య వల్లభుడు భగవానుని బాలరూపమును ఉపాసించాడు. సంప్రదాయంలో నేటికిని ఈపద్ధతి ప్రచారంలో ఉంది. బాల్యావస్థ మనోముగ్ధకరంగా, హృదయరంజకంగా ఉంటుంది. భగవంతుని తనపుత్రుని రూపంలో ఊహించి ఆనందించడం భక్తి భావనలో అత్యంతకోమలమైన కమనీయ స్థితిగా చెప్పవచ్చును. భక్తిలో సర్వ సమర్పణం స్వతహాగా అవసరం. తనబిడ్డని కొరకై బాలారిష్ట నివారణకై అతని సంరక్షణ, వృద్ధికై తల్లిదండ్రులు ఏమి చేయరు? మనసుని కేంద్రీకరించుటకు బాల చరితము ఉత్తమ సాధనం. బాల గోపాలుడైన శ్రీ కృష్ణుని శైశవ లీలలు మనోవైజ్ఞానికులు బాల ప్రవృత్తిని అధ్యయనం చేయడానికి పనికి వచ్చినప్పుడు అవి భక్తుని తప్పుని సరిగా ఆకర్షిస్తాయి. ప్రతి గృహస్థునకు అనుభవంలో ఉన్న విషయముతే భవ్యరూపంలో ఉదాత్తీకృతమై (Sublimised), సాధారణీకృతమయ్యేట్టు చిత్రించడం కుశలకవికార్యం. బాల సహజమైన చేష్టల వర్ణన గమనించుడు.

హరి అపనే అంగన్ కఛు గావత్ ।
తనక్ - తనక్ చరనని సౌం నాచత్ మనహీం మనహీం రిఝావత్ ॥
బాహ్ ఉఠాయి కాజరీ, ధౌరీ, గైయని టేరి బులావత్।
కబహుంక్ బాబా నంద్ పుకారత్ కబహుంక్ ఘరమె ఆవత్॥
మాఖన్ తనక్ ఆపనే కరకై తనక్ బదన్ మేం నావత్।
కబహుంక్ చితై ప్రతిబింబ ఖంబ్ మేం లానీ లియే ఖవావత్॥
దురి దేఖతి జసుమతి యహ్ లీలా హరష్ ఆనంద్ బఢావత్।
సూర్ స్యామ్ కే బాలచరిత్ చితి నిత్ హీ దేఖన్ భావత్॥

—సూరసాగర్ 10/795

అనంతుడు అంగణంలో ఆటలాడుచున్నాడు. అతని నోటినుండి సంగీత స్వరాలేవో వినవస్తున్నాయి. బాలవృత్తి సహజంగా సంగీతాత్మకం, దాన్ని భావ జగత్తుకు ప్రసవభూమి యనీ ప్రేరకమనీ చెప్పవచ్చును. సంగీతంలో ధ్వనుల సామంజస్య ముంటుంది.

బాల్యావస్థలో ఈ సామంజస్యం అధికంగా ఉంటుంది. రాగద్వేషాల వక్రత శైశవంలో ఉండదు. ఇవి యౌవనంలో ప్రారంభమై వికాసం పొందుతాయి. సమతా విధాయిని బాల్యదశ సంగీతంలో గంతులే యడం సహజం. చిరుచరణాలతో గజ్జలతో చిరుగంటలతో నృత్య భంగిమలు చూపడం పసి పిల్లల సహజ చేష్టల విశేషం. బాలురు చేత నాచేతనముల భేదం గానరు. చిన్నికృష్ణుడు శ్యామా, ధవళ ధేనువులను గొంతెత్తి పిలుస్తాడు. మధ్యలో నందుని బాబా యని పిలుస్తాడు. ఇంట్లో ప్రవేశించి వెన్నలు తెస్తాడు. తన నోట్లో కొంత, స్తంభం నీడలో గల వాని నోటిలో కొంత పెడతాడు. ప్రతిబింబమేమి తింటుంది. స్తంభమంతా వెన్నముద్దలు వెలుస్తాయి. తల్లి యశోద ఈ చిలిపి చేష్టలు చూచి ఆనందిస్తుంది. భగవానుని లీలలు దేశకాల పాత్రల కతీతమైనవిగాన నేటికిని అందరినీ అలరిస్తున్నాయి.

బాల్యదశ సంశ్లేషణమయం, విశ్లేషణ కంతు పట్టదు. విశ్లేషణబుద్ధి యొక్క ప్రౌఢత్వంపై ఆధారపడుతుంది. బాలుడు అనేకరకాల వస్తువులను సంగ్రహిస్తాడు. వాటి గుణజ్ఞానం వానికుండదు. అందుకే రాత్రి ఉదయించిన చంద్రుని ఆట బొమ్మగా తలచి పట్టితెమ్మని మారాము చేస్తాడు. ఒక మారు చంద్రుని వెన్నముద్దగా తలచి తింటా నంటాడు. నీళ్లలో చంద్రుని చూపిస్తే ఆనందిస్తాడు. కాని రెండు చేతులతో పట్టబోయి భంగపడ తాడు. బుజ్జగమూలి పెట్టి మోసం చేసినందుకు అల్లరి పెడతాడు.

బాల్యదశలోని ఎన్నో దృశ్యాలను సూరదాసు చిత్రించాడు. స్నేహితులతో కలిసి బాలకృష్ణుడు చేసిన అల్లరి వర్ణించ నలవికానిది. కనుకనే కవులు లీలలని కొంత చెప్పి, తనివి తీరగా చెప్పలేక, ఊరుకుంటారు. బాలురలో గల ప్రతిస్పర్ధభావనను సూరదాసు చిత్రించాడు. సఖ్యభావ చర్చలో ఈ విషయం ప్రస్తావించబడింది. మృద్భక్షణ సందర్భంలో సూరదాసు వాత్సల్య సంబంధమైన అద్భుత దృశ్యమును చిత్రించాడు. కృష్ణుడు సఖులతో పాడడం, ఆడడం, అల్లరి చేయడం యశోదకు ఎంతో

ప్రీతికరం. కాని మధ్యలో కన్ను మరపించి మన్నుతినడం కోపం తెప్పిస్తుంది. నోరు తెరచి చూపమంటే చూపకుండా పరుగెడతాడు. తల్లి దుడ్డుకట్టె తీసుకొని వెంటపడుతుంది. ఇంతవరకు వ్రజవాసుల చాడీలు చెవిని బెట్టలేదు. కాని నేడు నమ్మకుండా ఉండలేక పోయింది. అల్లంత దూరాన ఉన్న చిన్నవాడిని నాటకంలో లాగ వెళ్ళి భక్తుడు, ఉపాస్యుని పట్టుకొన్నరీతి దొరకబడుతుంది. విశ్వరూప సందర్శన చేస్తుంది. భ్రమయవనిక తొలగింది. తనను తాను మరిచి పోయింది.

మోహన్ కాహైం న ఉగిలౌ మాటీ।
బార్-బార్ అనరుచి ఉపజావతి, మహరి హాథ్ లియే సాంటీ॥
మహతారీసౌం మానత్ నాహీం, కపట్-చతురాయీ తాటీ।
బదన్ ఉఘారి దిఖాయో అపనౌ, నాటక్ కీ పరి పాటీ॥
బడీ బార్-భయీ లోచన్, ఉఘరే భరమ్ జవనికా ఫాటీ।
సూర్ నిరఖినందరాని భ్రమిత భయీ, కహతి న మీఠీ
ఖానీ॥

—సూరసాగర్, 10/254

యశోద చకితురాలై అంతా మరచి పోతుంది. చేతిలో బెత్తం జారిపోతుంది. కృష్ణుని భుజమును వదలి వేస్తుంది. కన్నులు మూసుకొని మూర్ఛితురాలౌతుంది, లలితాంగి యశోద తన బాలుని ముఖంలో జలధివన భూగోళ శిఖరములను, సూర్యచంద్రులను దిక్కాలాది బ్రహ్మాండముల దర్శించి వాత్సల్య భావమున కాశ్రయ స్వరూప మైన బ్రహ్మానందమును అనుభవిస్తుంది. ఈ సందర్భంలో పోతనగారి పద్యం-'కలయో వైష్ణవ మాయమో, ఇతర సంకల్పార్థమో, సత్యమో, తలపన్నేరక యున్నదాననొ యశోదాదేవిగా పరస్థలమో'-జ్ఞాపకం వస్తుంది.

చిన్నికృష్ణుడు వెన్న దొంగతనాలు మొదలు పెడతాడు. ఇంటింటా పెరుగులు మాయం, వారి కడవలు వీరింట్లో, వీరి

కడవలు వారింట్లో పగిలి దొరికితే జగడాలు. అత్తా కోడళ్ళకు అనుమానాలు. అత్త ఆరట్లు, కోడలు పాట్లు. కోడళ్ళు కట్టుగట్టి దొంగను పడతారు. తల్లి ముందు నిలబెడతారు. చిన్ని కృష్ణునికి పెద్దలాయరులక్షణం, తప్పించుకునే నేర్పరితనం మెండు. తనచేతులు చిన్నవనీ, ఉట్టి ఎత్తున ఉందనీ చెప్తాడు. పైగా వాళ్ళంతా పనిగట్టుకుని తన ముఖానికి పెరుగు వెన్నలు రుద్ది తనను ఆట పట్టిస్తున్నా రంటాడు. అంతలో మూతి తుడుచుకుని వెన్నదొన్నెను వెనుక దాస్తాడు. ఇది చూచిన తల్లికి అమితమైన వాత్సల్యం, ప్రేమ జనిస్తుంది. సూరదాసు యశోదకు ప్రాప్తించిన సుఖం శివబ్రహ్మాదులకు కూడ దుర్లభ మంటాడు.

మైయా మైం నహి మాఖన్ ఖాయో।
ఖ్యాల్ పరై యేసఖా సబై మిలి, మేరే ముఖ్ లపటాయో॥
దేఖి తుహీ సీంకే పర్ భాజన్, ఊంచే ధరిలటకాయో॥
హౌం జు కహత్ నాన్హేకర అపనై మైం కైసై కరి పాయో॥
ముఖ్ దధి పోంఛి బుద్ధిఇక్ దీన్హీ, దోనాపీఠి దురాయో।
డారిసాంటి మునుకాయి జసోదా, స్యామహిం కంఠ్ లగాయో॥
బాలవినోద్ మోద్ మన మోహ్యో, భక్తిప్రతాప దిఖాయో॥
సూరదాస్ జసుమతికా యహ్ సుఖ్, సివవిరంచి నహిం పాయో॥

సూరసాగర్, 10/334,

మరోమారు అకస్మాత్తుగా దొరికి పోతాడు. అప్పుడు మరో మిష. పెరుగులో చీమ పడిందట. తీయబోతున్నాడట. పరుల ఇంట పెరుగులో చేయి బెట్టడ మేమిటి. వారికి నేర్పుతో మాటలు నేర్పడ మేమిటి. ఈచతురోక్తులకు ఆనందం కలుగక మానదు.

బాల కృష్ణుడు హలధరుపై చాడీలు చెప్పి తల్లి వాత్సల్యాన్ని చూరగొంటాడు. తనను అంగట్లో కొన్నారట. తల్లి తెలుపు, తండ్రి తెలుపు నీవు నల్లవాడవు ఎక్కడ నుంచి వచ్చావురా అన్నాడట.

అంతేకాదు అందరికీ నేర్పుతాడు. నవ్వుల పాలు జేస్తాడు. తల్లి బలరాముని ధూర్తుడు అంటుంది. గోధనమూలాన నీవు నాముద్దుల కొడుకవురా అని బుజ్జగిస్తుంది.

మైయా మోహిఁ దాఊ బహుత్ ఖిజాయో।
మోసోఁ కహత్ మోల్ కా లీన్హో, తూజసుమతి కబ్ జాయో॥
కహాఁ కరౌఁ ఇహిరిస్ కే మారే ఖేలన్ హౌఁ నహిఁ జాత్।
పునిపుని కహత్ కౌన్ హై మాతా, కో హైతేరా తాత్।
గోరే నంద్, జసోదా గోరీ తూకత్ స్యామల్ గాత్।
చుట్ కీ దై-దై గ్వాలనచావత్, హఁసత్ సబై ముసుకాత్।
తూమోహీఁకో మారన్ సీఖీ, దాఉహిఁ కబహుఁ నఖీజై॥
మోహన్ ముఖ్ రిస్ కీ యేచాత్, జసుమతి సుని-సుని రీఝై॥
సునహు కాన్హ బల భద్రచబాయీ, జనమత్ హీ కా ధూత్।
సూర్ స్యామ్ మోహిఁ గోధన్ కీసోఁ హౌఁ మాతాతూ పూత్॥

—సూరసాగర్-10, 833

గోపికలు, గోపాంగనలు వాత్సల్య భావనకు ఆశ్రయములు. గోవిందుడు చేసే అల్లరి పనులను గూర్చి యశోదకు పితూరి చేయుటకు వస్తారు. గొల్లపల్లెను వదలి పెట్టి వెళ్ళడానికైనా సిద్ధమేపని, ఇంకా అచ్చట కాపురం చేయలేమని పరిపరివిధాల విన్నవించుతారు. ఎవరెన్ని చెప్పినా 'కాకి పిల్ల కాకికి ముద్దు అన్నట్లు యశోద చెవిని బెట్టదు. అయినా వారు పితూరి చేయడం మానరు, ఊరువదలి వెళ్ళరు. కారణం సూరదాసు స్పష్టంగా చెప్తాడు. ఉపాలంభము మిష చేత వారు హరిసంగతినే కోరుతారు. అతనిని చూడకుండా క్షణమైనా ఉండలేరట. చీరలు చింపినా, హారములు తెంపినా, వెన్నలు దొంగిలించినా సహిస్తారు. కృష్ణ దర్శనం కొరకే యశోద చెంత చేరి చాడీలు చెప్తారు.

గ్వాలిని ఉరహాన్ కై మిస ఆయీ।
నందనందన తనమన హరి లీన్హౌ బిసుదేఖై ఛిన జాయి॥
సునహు మహరి అపనే సుతకే గున్, కహాకహా కి హి భాంతి బనాయీ।
చోలీఫారి, హారగహి తోరయా. ఇనబాతని హా కాన్ బఢాయీ॥
మాఖన్ ఖాయి, ఖవాయౌ గ్వాలిని జౌ ఉబరయౌసో దియౌ బఢాయీ।
సున హుసూర్, చోరీ హి లీన్హీ, అబ్ కైసై సహి జాతి దిఠాయీ॥

గోపికలు చాడీలు చెప్తూనే యశోదను పిసినారి అనియు, ముద్దు చేయటమే తప్ప వెన్నముద్దలు పెట్టదనియు అంటారు. ఈ మధ్యలో కృష్ణునితో చూపులు కలుస్తాయి. మాట్లాడతారు. గబగబా పరుగెత్తి ఎత్తుకుని ముద్దాడుతారు. ఈ విధమైన వాత్సల్య ప్రేరకమైన చేష్టలను సూరదాసు అద్భుతంగా వర్ణించాడు. గోపికల హృదయంలో ప్రేమ ఉంది. అది ఎన్నో విధాలుగా వ్యక్తమవుతుంది. ఆటలలో అలుగడంలో నిరోధ సుఖం ఉంది.

వాత్సల్యసంయోగ భావనలోనే వియోగ భావన వర్ణించబడింది. సంయోగస్థితిలోనే వియోగం అనుభవింపజేయడం సూరదాసు కలం యొక్క నేర్పరితనం. అనిష్టం కలుగుతుందనే ఆశంకతో కనుల ముందే కనబడుచున్న సుకుమారుని జూచి వాత్సల్యాతిరేకంలో యశోద వ్యాకుల పడుతుంది. తృణావర్తవధ సందర్భంలో ముంగిట్లో ఆడుకొనుచున్న ముద్దుల బాలుడు ఆకాశంలో రాక్షస వధగావించి ఏమీ ఎరుగనట్టు మట్టిలో పొర్లాడుచుండగా గాంచి విహ్వలమతి అవుతుంది. ఇచ్చట యశోదానందుల ప్రేమాతురత, విహ్వలత, వాత్సల్యాతిరేకం వర్ణనాతీతం.

వాత్సల్యంలో వియోగపక్షం తీవ్రమైంది. అష్టఛాప్ కవులలో సూరదాసు వియోగ వాత్సల్యాన్ని చక్కగా చిత్రిం

చాడు. శ్రీకృష్ణబలరాములు అక్రూరు వెంట ధనుర్యజ్ఞంలో పాల్గొనుటకు పోతున్నారు. కుసుమ కోమల శరీరులైన కృష్ణబల రాములను అక్రూరుడు ఒడిలో తీసుకొని పులకితగాత్రు డవుతున్నాడు. ప్రయాణం మాట వినగానే యశోద వ్యాకుల చిత్త అయింది. చంద్రుణ్ని చూస్తున్న చకోరివలె అతృప్తనయనాలతో పుత్రులను వీక్షిస్తోంది. యశోద వారిని చూడకుండా ఉండలేదు. కృష్ణునికి బదులుగా కంసుడు ధనరాసులు, గోధనములను ఇచ్చుటకు సిద్ధంగా ఉన్నాడు. కాని యశోద విదీర్ణ మనస్కయై తన వాకిట ఆడుకునే వాడెవడు, వెన్నలు దోచి తినే వాడెవడు అని విలపిస్తూ మూర్ఛిల్లుతుంది. రోహిణి మూర్ఛలో పలువరి స్తోంది.

కృష్ణబలరాములు మధురానగరిలో పరిపాలన చేస్తున్నారు. నందు డొకమారుపుత్రులనుచూడడానికివెళ్తాడు స్వాగత సత్కారాలు పొంది నాలుగురోజు లుండి తిరిగి వస్తాడు. ఒంటరిగా తిరిగి వచ్చిన నందుని జూచి యశోద ముఖం తుషారాఘాతమైన కమలంవలె ముకుళితమై పోతుంది. నందుని అనేక విధాలుగా తూలనాడుతుంది. కఠోరహృదయుడవైన నీకు దశరథునికి భేదం లేదంటుంది. నా బిడ్డని కచ్చుట ప్రొద్దుటే రొట్టె వెన్న పెట్టే దెవరని వాపోతుంది. కృష్ణునికి ప్రియమైన వస్తువులను చూచినపుడల్లా దుఃఖిస్తుంది. ఎవరో బాటసారితో వార్త లంపుతుంది.

> జద్యపి మనసమఝావత్ లోగ్।
> సూల్ హోత్ నవనీత దేఖి మేరే మోహన్ కేముఖజోగ్॥
> ప్రాతకాల ఉఠి మాఖన్ రోటీ కోబిను మాఁగే దైహై॥
> అరు ఉఠి మేరే కుఁవర్ కాన్హాకో ఛినఛిన అంక మదో ఉ
> ఖైయా।
> సూర్ స్యామ కత్ హోత్ దుఖారీ జినకే మోసో మైయా॥
>
> సూరసాగర్ 10/3711

ఎంతో మంది ఊరడించినప్పటికీ వెన్నను నచూసిప్పుడల్లా మోహనముఖం స్మరణకు వస్తుంది. ప్రాతః కాలమున లేవగానే

అడుగ కుండానే వెన్న రొట్టెను పెట్టిదానిని ఒడిలో కూర్చుండ బెట్టుకుని ఇద్దరు బిడ్డలకు ముద్దుగా తినిపించెడి దాన్ని. వాలాంటి దుఃఖితురాలు మరొకతి ఉండ బోదని విలపిస్తుంది. మరొక పదంలో దేవకికి వార్త లంపుతుంది.కృష్ణుడు సంకోచం కలవాడు. దేవకిని అడ గడంలో సిగ్గుపడుతుండవచ్చును. ప్రొద్దున్నే లేస్తే కృష్ణునికి వెన్న రొట్టె కావాలి. హఠం కూడ చేస్తాడు. బతిమిలాడించుకుని మరీ తింటాడు. నలుగుపిండిని, నీళ్ళను చూచి స్నానము చేయకుండానే పరుగులెడతాడు. అడిగిన వన్నీ ఇస్తూ వుంటే క్రమక్రమంగా స్నానా నికి ఉపక్రమిస్తాడు. రాత్రింబవళ్ళు ఇదే చింతన. నాతో దెబ్బలాడి తినేవాడు ఆకలికి ఎంత మాడిపోతున్నాడో అని తల్లి తపన. ఢిల్లీకి రాజైనా తల్లికి ముద్దుల పట్టియే కాదా, అనే చిరంతన సత్యం వ్యక్తమవుతోంది. యశోదకారణంగా సూరదాసు తల్లి హృద యాన్ని చిత్రించాడు. ప్రపంచంలో తల్లి ఒక పవిత్రమైన రహస్యం. ఈ రహస్యం విప్పి చెప్పగల సమర్థత కవికి తప్ప మరొకనికి ఉండ బోదు. నందుడు మధురానగరి నుంచి తిరిగి వచ్చి బిడ్డని గుణములను స్తుతించినపుడు వర్ణించిన పోతన పద్యం మాత్ర హృదయాన్ని విడమర్చి చెబుతుంది.

పెనిమిటి బిడ్డని గుణములు
వినుతింప యశోదప్రేమవిహ్వలమతియై
చను మొనల బాలు గురియగ
కనుగొనలను జలము లొలుకగా బెగ్గిలియెన్॥

**మధుర భావము:-**

పరమారాధ్యుని ప్రియునిగా తలంచి ఉపాసించడం మధుర భావము అనబడుతుంది. శ్రీవల్లభాచార్యుల పుష్టి మార్గంలో దాంపత్య భావము, పరకీయకాంతాభావము గ్రాహ్యము. ఇష్టదేవుని మధురాధిపతిగా వర్ణించి అతని అంగచేష్టాదులలో అనురక్తి కలిగి ఉపాసించుట ప్రధానము, దీనిని భక్తిశృంగార మని మధురభక్తి అని అంటారు. సూరదాసు దీనినే ప్రేమ

లక్షణాభక్తి అన్నాడు లౌకిక ప్రేమలో ఎన్ని భావము లున్నవో అవి యన్నీ ఈ లోకం నుంచి తొలగించబడి ఈశ్వరుని వైపు మళ్ళించబడుతాయి. ఈలోకపక్షంలో శృంగారమని దేన్నంటారో భక్తి మార్గంలో దానిని మధురభక్తి అంటారు. అందువల్ల భక్తిరసంలో ఔచిత్యానౌచిత్యవిచారణ ఉండదు. పరకీయ భావాంతర్గతమైన సంయోగ వియోగ శృంగారములు, స్వీకృతములు, సూరదాసు పరకీయ భావమునకన్న స్వకీయ భావమునకు స్థానము ఇచ్చాడు. దాస్యము కన్న సఖ్యము మిన్న. సఖ్యము కన్న వాత్సల్యం సమీపం. వీటన్నింటి కంటె రతి భావం ఆరాధ్యుని సన్నిధికి అతిసన్నిహితము. క్రమంగా తజ్జనిత ఆనందం కూడా పెరుగుతూ ఉంటుంది. వెన్న దొంగతనము వస్త్రాపహరణము, మహారాసము (రాసలీలలు) ఇవియన్నీ రసమును ప్రసాదించు క్రీడలు, శ్రీవల్లభాచార్యులు భక్తి మార్గంలో సన్న్యాసము యొక్క పర్యవసానము రాసలీలలేనని అంటారు. వారు శ్రుతి రూపులైన గోపాంగనలను ఈ క్షేత్రానికి అధికారు లంటారు. ఆచార్యులు మధుర భక్తికి అత్యంత ప్రముఖ స్థాన మిచ్చారు.

కావ్యంలో నాయికానాయకుల యొక్క అనురాగ వృత్తుల వర్ణన ఉంటుంది. భాగవతంలో నాయికా నాయకులు ప్రకృతి పురుషులు. అవతార రూపంలో ప్రాప్తించిన మహోత్సవము, సాధారణంగా కావ్యంలో మానవ వృత్తులు ప్రతిబింబిస్తాయి. భాగవతంలో ఈశ్వరుడు మానవలోకానికి దిగివచ్చాడు. ఆశుభ సన్నివేశంలో ప్రాప్తించునదే పరమానందం. గోపికలు ఇందు మునిగి తేలిన భక్తాగ్రగణ్యులు.

సూరదాసు భక్తి మాధుర్యభావంపై ఆధారపడి ఉంది. నవధా భక్తి ఆధారంగా సూరదాసు ఏకాదశ ఆసక్తులను పోషించాడు. కృష్ణునియొక్క అలౌకిక గుణముల వర్ణనలో వినయము, బాల భావము, దుష్టశిక్షణాదులలో గుణమహాత్మ్యాసక్తి ఉన్నది. కృష్ణుని బాలకిశోర దశలలో రూపమాధురి అనగా రూపాసక్తి వర్ణించబడింది.

ఇదేవిధముగా దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, ఆత్మనివేదనాసక్తి, కాంతాసక్తి మరియు పరమ విరహాసక్తి ఉన్నాయి. వీటిలోనే మాతృవిరహాసక్తి, దాంపత్యవిరహాసక్తి కూడవస్తాయి. సూరదాసు ప్రేమభక్తికి ప్రముఖస్థానమిచ్చాడు. లౌకిక పారలౌకిక విషయములకు ప్రేమయే మూలమని ఆతని నమ్మకం. ముక్తిప్రాప్తికి కూడ అతడు ప్రేమ, కృప అవసరమంటాడు.

ప్రేమభక్తి బినుముక్తిన హోయి, నాథ్ కృపాకర దీజై సోయి।
జీవ సకల హామ దేఖ్యో జోయి,తుమ్హారీ కృపా హోయి సో హోయి॥

ప్రేమ భక్తి యొక్క ప్రాప్తికి ముఖ్యసాధనము. గోపికలకు కృష్ణుని యెడల ప్రేమ ప్రదర్శన, రాసలీలలు, సుదాముని దారిద్ర్య నివారణ మొదలగునవి భగవానుని భక్తి వాత్సల్యానికి నిదర్శనలు. కావున ప్రేమనుండి ప్రేమ పుడుతుంది అనన్య ప్రేమ నుండి ముక్తి కన్న మిన్నయైన గోపాలుని ప్రాప్తి కలుగుతుంది.

ప్రేమ ప్రేమ తే హోయ్, ప్రేమ తే పారహి పైయే।
ప్రేమ బంధాయో సంసార్, ప్రేమ పరమారథ్ లహియే।
ఏకై నిశ్చల ప్రేమకో జీవనముక్తి రసాల్।
సాంచై నిశ్చయ్ ప్రేమ కో జేహి తే మిలే గోపాల్॥

చిన్ననాటి ప్రేమ పెరిగి పెద్దదై కిశోరావస్థలోని ఆకర్షణ కుతూహలమునకు లోనై యౌవ్వనములో మధురమై ప్రేమగా వికసిస్తుంది. ఒకనాటి రూప చర్చవల్ల ఒకసారి చూడడం వల్ల అకస్మాత్తుగా ప్రేమ పుట్టుకరాదు. నిత్యమూ తమ మధ్య ఆడుతూ పాడుతూ, నవ్వుతూ, నవ్విస్తూ వనములో గోవులను మేపుతూ ఉన్నటువంటి కృష్ణునిపై గోపికలు అనురక్తు లవుతారు. ఒక్కనాటి విప్లవముగా కాక ఎన్నియో ఘట్టములు, విఘ్నములు, బాధలు మొదలగు వారధులతో కూడిన పెద్ద కథ ఈ ప్రేమ కథ, దీనిని ఉజ్జ్వలరసమని అంటారు. ఇది శృంగారానికి ఆధ్యాత్మిక

పరిణతి. దీనికి వయోభేదము, లింగభేదము, లౌకిక వాసనలతో సంబంధము లేదు. ఈ ప్రేమసాహచర్యజన్యమైన సహజప్రేమ.

గోపిక హృదయంలో ప్రేమ ఉంది. కాని గోపాలు డతి చిన్న బాలుడు. అతనిని పిలిచి ముద్దులాడి ఆలింగనం చేసుకుంటుంది. ఆత్మసమర్పణం చేసుకుని శరణాగతురాలవుతుంది. ఒక పదంలో సూరదాసు చమత్కారం చేశాడు, లీలాధారియైన బాలకృష్ణుడు ప్రియభామినివయసు కనుగుణమైన నవ నాగర కిశోరరూపంలో దర్శన మిచ్చి ఆత్మరతిలో ఆనందించాడు. గోపికలు సర్వమును మరచి లోకమర్యాదను త్యజించి కామాసక్తులయినారు. అనేక మిషలతో పితూరీలు చెప్పే నెపంతో కృష్ణస్పర్శ చేసేవారు. ఎంతో అమాయకురాళ్ళుగా ఉంటూనే దంతక్షతాల నఖక్షతాల గూర్చి చాడీలు చెప్తూనే తమ ప్రేమను మాత్రం దాచడానికి ప్రయత్నించే వారు.

కృష్ణుడు ఐదు సంవత్సరాల బాలుడు, అప్పుడు కామాసక్తిని ఆపాదించుట అన్యాయము కదా! కాని మనోవైజ్ఞానికముగా అస్వాభావికము కాదు యువతీ యువకులలో బాలసంసర్గమిషను కామరతి ఉద్భవించుట సిద్ధము. కాని ఇచ్చట కామరతికి ఆలంబన బాలుడు కాదు. గోపికల మనస్సులో ఉన్న కామోత్సాహము బాలునికి లేదు. అందుచేతనే కవి లీలల నాధారముగా అతడు కిశోరుడై తరువాత వెంటనే బాలకుడై నట్లుగా చిత్రిస్తాడు. ఇది ఆలంబనము యొక్క అతిమానవీయము, లౌకికము అయిన వాతావరణము నిర్మిస్తుంది. చిన్ననాటి ప్రేమ యొక్క క్రమవికాసానికి ఇది ఆటంకము. కాని రహస్యమై అలౌకికమై మధుర భక్తి యొక్క సంయోగ పక్షాన్ని లౌకికము కాకుండా కాపాడుతుంది.

మధుర భావము యొక్క ఉత్కర్షలో వేణునాదము తోడ్పడుతుంది. మురళీమాధురిలో కృష్ణాధీనలు, కృష్ణాసక్తలు, అశాంతలు, చంచలచిత్తలై గోపికలు లోక మర్యాదలను మరచి పోతారు.

'(కహాఁకహా) అంగనికీ సుధి బిసరి గయీఁ।
స్యామ్-అధర్ మృదు సునత్ మురలికా చకిత నారిభయీఁ॥
జొజైసేఁ సొతైసేఁ రహిగయీఁ, సుఖ్ దుఖ్ కహ్యోన జాయి।
లిఖీ చిత్రసీ సూర్ సు హ్వైరహీఁఅక్టక్ పల్ బిసరాయి॥

—సూరసాగర్-10/1239

మురళీధరుని మురళీధ్వని విని గోపికలు గృహకార్యములు మరచిపోయిరి. పాలుగుడుచుటకు లేగలను విడువరు. విడిచిన లేగలను గుంజి గుంజలకు కట్టివేయరు. పాలు పితుకరు పితికిన పాలను దాలిన జేర్చరు. కాగిన పాలను దించుట మరచిరి, దించిన పాలను పిల్లలకు త్రాగించరు. మందగామినులు అమందగతితో గోవిందుని చెంతకు పరుగులెత్తిరి. వేణుగాన మహిమలో నదులు, వనపర్వతములు చరాచరజగత్తు ప్రభావితమై ఆనందరస ప్రవాహములో ఓలలాడుతుంది. అప్పుడు గోపిక మానసిక స్థితిని కవి వర్ణించుతాడు.

మురలీ ధుని స్రవనసునత్ భవన రహిన పరై।
ఐసీకో చతురనారి ధీరజ మనరైన్ ధరై॥

—సూరసాగర్ 10/1270.

మురళి యొక్క అచంచల భక్తికి గోపాలుడు తలవంచాడు. ఇది గోపికల హృదయాలను ఛేదించేది, బాధించేదిగాను తయారై వలి పోరుకు దారి తీసింది. మధ్య యుగంలోని బహుభార్యాత్వంలోని సవతుల పరస్పర ఈర్ష్యాద్వేషాలను భక్తి క్షేత్రములో సూరదాసు ఉదాత్తీకరణం చేశాడు.

మురలీ తఊ గోపాలహిఁ భావతి।
సునిరీ సఖి జదపి నందలాల హిఁ, నానా భాంతి నచావతి॥
రాఖతి ఏక్ పాయి ఠాడౌకరి, అతి అధికార జనావతి।
కోమల్ తన అజ్ఞాకరవావతి, కటిటేఢీ హ్వై ఆవతి॥

అతి అధీన్ సుజాన్ కనౌడీ, గిరిధర్ నార్ నవావతి।
ఆపున్ పౌఢి అధర్ సజ్జాపర్, కరపల్లవ పలుటావతి
భృకుటీ కుటిల్ నైన్ నాసాపుట్ హమ్ పర్ కోప్ కరావతి।
సూర్ ప్రసన్న జాని ఏ కౌఛిన్ ధరత్తైఁ సీస్ డులావతి॥
—సూరసాగర్ 10/1273

అనురాగసూత్రంలో బంధించి అధరసెజ్జపై పరుండి కృష్ణుని చేత కాళ్ళు ఒత్తించుకుంటూ తమతో వేరుచేసి తమపై అధికారం చేస్తోదని వాపోతారు. కాని గోపికలు సహృదయలు తమసేవలో భక్తిలో అనురాగంలో ఏదోలోపం ఉందని సాధనలో తాము వెనుక పడ్డామని భావిస్తారు. మురళి యొక్క సుకృతమును తపశ్శక్తిని స్తుతిస్తారు.

మురళీ కౌన్ సుకృత్ ఫల్ పాయే।
అధర్ సుధా పీవత్ మోహన్ కౌ, సబై కలంక్ గవాఁయే॥
మనకఠోర్ తనగాఁఠి ప్రగట్ హీ, ఛిద్రవిసాల్ బనాయే॥
అంతక్ సూన్యా సదాదేఖి యత్ హై నిజకుల హాంస సుభాయే॥
లఘుతమ అంగ్, నహిఁ కఛుకరనీ, నిరఖత్ నైన లగాయే।
సూరదాసప్రభు పానిపరసినిత్, కామబేలి అధికాయే॥
సూరసాగర్ – 10/1239,

యోగివలె తపమనే అగ్నిలో మ్రగ్గి, చెవులకు రంధ్రములు చేసుకొని, అంతరములో వికారములు తొలగించి మురళి పునీతురాలైంది. కావుననే దానికి కృష్ణస్పర్శ సౌభాగ్యం ప్రాప్తించింది. స్త్రీ సహజమైన మానసిక వికారాలను పరమాత్మునికి సమర్పింప జేసే ఉజ్జలతత్త్వం సూరకావ్యంలో అత్యద్భుతంగా చిత్రించబడింది.

శ్రీకృష్ణుడు అవతరించడంలో వ్రజ మండల మంతా సుశోభితమైంది. వైకుంఠమే మానవ మండలముపై దిగివచ్చిందని పించింది. వ్రజ భూమిలో ద్వాదశ వనాలున్నాయని సూరదాసు వర్ణించాడు. శ్రీ కృష్ణ, మధు, కుముద, బహులా కామ ఖదర్

వృందా భద్ర, భాండీర, వేల, లోహ మరియు మహా వనములలో నిత్యరాస లీలలు నడవడంతో వ్రజ భూమి ధన్యమైంది.

శ్రీకృష్ణుని త్రిభంగి రూపం అతిరమ్యం. వేణుగానంలో శ్రవణాసక్తి పెరుగుతుంది. అది వ్యసనదశలోకి రాగానే శ్రీకృష్ణ సందర్శనం కలుగుతుంది. శ్రీకృష్ణుడు సౌందర్య సాగరుడు, అతని దర్శనంతో బుద్ధి కుంఠిత మౌతుంది. వివేకం నశిస్తుంది పరాజ్ఞానం పరాభక్తిలో అనంతంలో లీనమై తన అస్తిత్వం మరచి పోతుంది.

దేఖౌమాయీా సుందరతా కౌ సాగర్॥
బుద్ధి వివేక్ బలపాల్‌న పావత్, మగన్ హోత్ మన నాగర్॥
తను అతి స్యామ అగాధ్, అంబునిధి కటిపట పీత్ తరంగ్।
చితవత్ చలత్ అధిక్ రుచి ఉపజతి భఁవర్ పరతి సబ్ అంగ్॥
నైన మీన్, మకరాకృతకుండల్, భుజసరి సుభగ్ భుజంగ్।
ముక్తామాల మిలి మానో, ద్వైసురసరి ఏకై సంగ్॥
కనక్ ఖచిత్ మనిమయ ఆభూషణ్, ముఖ్ శ్రమ కన్ సుఖ్ దేత్।
జను జలనిధి మథి ప్రగట్‌కి యాసని శ్రీఅరుసుధా సమేత్॥
దేఖి సరూప్ సకల్ గోపీ జన రహీఁ విచారి విచారి।
తదపి సూర్ తరిసకీనసోభా రహీఁ ప్రేమపచి హారి॥
సూరసాగర్ 10— 246,

ఈ పదం చదవగానే పోతన గారి పద్య మొకటి స్ఫురిస్తుంది.

కుండల దీప్తగండమును గుంచిత కుండల ఫాలమున్ సుధా
మండిత పల్లవాధరము మంజుల హాస విలోకనంబునై
యుండెడు నీ ముఖంబు గని యుండగవచ్చునె మన్మథేశు కో
దండవిముక్తబాణముల దాసల మయ్యెద మాదరింపవే॥
— శ్రీమహా భాగవతము. 10_993,

గోపికలు శ్యామమయములై పతులను, బిడ్డలను, బంధువులను, అత్తమామలను వదలి కృష్ణుని చెంతచేర్తారు. రసోపాసకుడైన సూర

దాసు రాధాకృష్ణుల లేక గోపీ కృష్ణుల సంయోగలీలలను వర్ణి స్తాడు. భక్తి శృంగారము యొక్క సంయోగపక్షమును రమ్యంగా చిత్రిస్తాడు.

ఆజు నంద నందన్ రంగ్ భరే।
బిబిలోచన్ బిసాల్ దుఁ హుఁని కేచితవన్ చిత్రిత్ హారే॥
భామిని మిలే పరమసుఖ్ పాయో, మంగల్ ప్రథమ కరే॥
కరసౌఁ కర్ జుకర్యో, కంజన్ జ్యోఁ అంబుజ్ ఉరజ్ ధరే॥
ఆలింగన్ దై అధర్ పాన్ కరి, ఖంజన్ కంజలరే।
హార్ కరి పాన్ కి యా జబ్ భామిని తబ్ గహి పాయ్ పరే॥
పుహుప్ మంజరీ, ముక్తని మాలా, అంగ అనురాగ ధరే
రచనా సూర్ రచీ వృందావన్, ఆనంద్-కాజ్ కరే॥
—సూర్ సాగర్ 10-1307,

అంతర్ధానుడైన కృష్ణుని నిరీక్షణలో క్షణ మొక యుగంగా గడిపే గోపికలకు మోహనుడు ప్రత్యక్షమయ్యే సరికి ప్రేమ పెల్లు బికి వస్తుంది. తలా ఒక రీతి తమ తమ ప్రేమ భావములను వ్యక్తం చేస్తారు. సూరదాసు పోతనలు ఈ దృశ్యాన్ని ఒకే విధంగా తిలకించారు.

అబల యొక్కతె భక్తి నంజలి గావించి ప్రాణేశు కెంగేలు
పట్టుకొనియె
నింతి యొక్కతె జీవితేశ్వరు బాహువు, మూపున నిడుకొని
ముదము నొందె
వనిత యొక్కతె తన వల్లభు తాంబూల చర్విత మాత్మహస్త
మునదాల్చె
బడతి యొక్కతె ప్రియ పదముల విరహాగ్ని తప్త
కుచంబుల దాపుకొనియె

భామ యొకతె భృకుటి బంధంబు గావించి
ప్రణయ భంగ కోప భాషణమున

దష్టదళన యగుచు దండించు కైవడి
వాడి చూడ్కిగముల నరుని జూచె॥

—శ్రీమహా భాగవతము 10–1059.

సూరదాసు గోపికమనోమోహనుని రూపము నుండి దృష్టి మరల్చలేక పోతుంది. రెప్పలు ఆర్పకుండ సగ్గు బిడియమూ లేక చూస్తూ ఉండి పోతుంది. ఒక సఖితో అంటుంది.

లోచన మేరే భృంగ్ భయేరీ।
లోక్ లాజ్ బన్ ఘనవేలాతజి, ఆతుర్ హ్వైజుగయేరీ॥
స్యామ రూపరస వారిజలోచన, తహాఁ జాయి లుబ్దేరీ।
లపశేలటకి పరాగవిలోకని, సంపుటలోభ పరేరీ॥
హాంసని ప్రకాస విభాస రేఖకై, నికసత్ పునితహాఁ పైరత్।
సూర్ స్యామ అంబుజ కరచరనని, జహాఁ తహాఁ భ్రమి
పైరత్।

సూర్ సాగర్ 10–1895

సూరదాసుగోపిక కృష్ణుని రూపమును తన కన్నులలో నింపుకొంటుంది. పోతనగోపిక నయనద్వారాలనుండి హృదయమందిరం చేర్చి మాయావి తప్పించుకోకుండా మళ్ళీ నయన ద్వారాలను మూసి వేస్తుంది.

ఒక్క లతాంగి మాధవుని యుజ్జ్వల రూపము చూడ్కి తీగెలం
జిక్కగ బట్టి హృద్గతము జేసి వెలిం జనకుండ నేత్రముల్
గ్రక్కున మూసి మేన బులకంబులు గ్రమ్మగ గౌగిలించుచున్
జొక్కములైన లోచనుల జొక్కుచు నుండెను యోగి కైవడిన్॥

—శ్రీమహా భాగవతము–10–1061

రాసక్రీడలు జలక్రీడల సందర్భములలో శృంగార భావసంయోగ పక్షము యొక్క వివిధ దృశ్యములను సూరదాసు మనోహరంగా చిత్రించాడు. అందలి ఆధ్యాత్మిక, తాత్త్విక భావములు

ఉత్కృష్టములా, సర్వకర్తయు, సర్వభోక్తయు ఐనవారికి పరాంగన లెవ్వరని భక్తపోతనవలె నిలవేసి అడుగుతాడు.

మధుర భక్తిని పురస్కరించుకొని సంయోగపక్షంలో రాధకు ప్రముఖస్థానముంది. రాధ అనగా తైల ధారావత్ :— అహైతుక భక్తికి నిదర్శనము, రాధాభావ భక్తియని రాధను ప్రతీకగా తీసుకుని భక్తిని మానవీకరణం చేశాడు శ్రీ వల్లభాచార్యులు త్రివిధనామావళి' లో 'రాధాసహచరాయ నమః' అని శ్రీ రాధాదేవిని సహాచరిగా అభివర్ణించారు. ఈ రాధయే శ్రీ కృష్ణావతారంలో రాసలీలా సమయంలో బ్రహ్మ యొక్క ముఖ్య రాధస్(లక్ష్మి)గా ప్రవేశిస్తుంది. శ్రీకృష్ణుకు ఆయమతో విశేషంగా క్రీడిస్తాడు. శుద్ధా ద్వైత దర్శనంలో పరబ్రహ్మయొక్క ఆత్మశక్తి అభిన్నమైన తత్త్వంగా గుర్తించబడింది. అందుచేతనే పుష్టిమార్గంలో శ్రీనాధునితో పాటు వేరుగా స్వామినీరూపం ఉంచలేదు. ఎక్కడైనా వేరుగా ఉంచితే అచ్చట ఆత్మశక్తి ధర్మరూపంలో కేవలం లీలల అనుభవార్థమేనని గుర్తించాలి. శ్రీమద్భాగవతంలో రాధ పేరొక్కనబడలేదు. ఆంధ్రభాగవతంలో కూడా ఒకలతాంగి అని మాత్రమే చెప్పాడు. అనగా రాధా భావం అని తాత్పర్యం. సూరదాసు పరకీయభావ పరివేశంలోనే స్వకీయనాయికగా రాధను చిత్రించాడు. శృంగార రసోత్కర్షకై మాత్రమే సూరదాసు రాధకు ప్రముఖస్థానం కల్పించాడు. ధార్మిక భావనతోపాటు సాహిత్యపరమైన ఆదర్శరక్షణకై రాధను కృష్ణుని ప్రక్కన నిలిపాడు. పెద్ద ఆనందోత్సాహ ఉత్సవంలో రాధాకృష్ణుల వివాహం జరిపించాడు. స్వకీయను చేశాడు. అయినప్పటికీ రాధలో పరకీయ భావమే వ్యక్తమవుతోంది. స్వకీయమో, పరకీయమో అనంత సౌందర్యాకర్షణలో జడచేతనములు అనంత వేగంతో ప్రవహిస్తున్న తరుణ మది. స్వకీయపరకీయము కావ్యదృష్టి, లౌకిక వ్యాఖ్యానాల కొరకు పరిదృష్టి. పరమాత్ముడు జీవమాత్రులకు ఆకర్షణ కేంద్రం. సూరదాసు రాధా కృష్ణుల ప్రేమను సహజరూపంలో వికసింప జేసి పరిణతికి జేర్చాడు.

పరబ్రహ్మ కృష్ణుని ఆహ్లాదినీ శక్తిగా రాధను జేసి ప్రకృతి పురుషుల మహాసమ్మేళనంలో మహారసమును సృష్టించి భక్తి శృంగారమును వికసింపజేశాడు.

సంయోగస్థితిలో కంటె వియోగావస్థలో వ్యక్తి తన ప్రియ జనులకు అత్యంత సన్నిహితుడౌతాడు. కారణం సంయోగావస్థలో ప్రియతముని విషయంలో నిశ్చింతగా ఉండడం. ప్రేమ ఎంత గాఢమైతే విరహ మంత తీవ్రమౌతుంది విరహం ప్రేమకు పరీక్ష వంటిది. సూరదాసు అభిమతంలో కూడ దుఃఖము కలుగనంత వరకు ప్రేమకు పూర్ణత లేదు.

విరహా రుఖ్ జహాఁ నాహిఁ వైకహుఁ తహాఁన ఉపజై
ప్రేమ్॥

సూరసాగర్ - 10/3413

విరహం లేనిది ప్రీతిలో వృద్ధిలేదు ప్రేమకు రంగులు నింపేది విరహమే. ప్రియతముని కలిపేటి సమాధి స్థితి వంటిది విరహం. సంయోగంలో, ప్రియుని కలయిక ఒకచోట జరిగితే వియోగంలో సర్వత్ర ఆసుఖం లభిస్తుంది. సూరకావ్యంలో ఆవిరహం కావ్యాను భూతి మాత్రమే, ఒక భావసాధనగా ఉంది. శ్రీవల్లభ సాంప్రదాయంలో విరహాసక్తికి విశిష్ట స్థానముంది. సూరదాసు తన పరిపూర్ణ సామర్థ్యంతో విరహకావ్యానికి సొబగులు గూర్చాడు.

కావ్యశాస్త్రంలో విప్రలంభ శృంగారం నాలుగువిధాలు. పూర్వరాగం, మానము, ప్రవాసము మరియు కరుణ. భక్త ప్రవరుడు రూప గోస్వామి మధుర విప్రలంభము నాలుగు విధాలుగా భావించాడు. పూర్వరాగం, మానము, ప్రేమవైచిత్తి మరియు ప్రవాసము భగవద్విరహములో కరుణకు స్థానము లేదు ప్రేమవైచిత్తి ప్రేమకు ఘనీభూతమైన పరిస్థితి. ఇందు ప్రియుని రూపరాశిలో ప్రేయసి నిండా మునిగి లీనమై

పోతుంది. తన అస్తిత్వం కోల్పోయి శుద్ధ అద్వైత స్థితిని పొందుతుంది. అయినా ప్రియుడు లేడని వ్యాకులపడి, తపించి, పోతుంది. దీనిలో ప్రత్యక్షం, పలకాంతర, వనాంతర మరియు దేశాంతర విరహమని నాలుగు రకాలుగా గుర్తించ బడినాయి.

రుక్మిణి హృదయంలో శ్యాముని గుణగణాల మూర్తి ప్రతిష్ఠింపబడి పూర్వరాగం ఉత్పన్నమైంది. జన్మ జన్మల దాస్యం చేద్దామని ఆత్మ సమర్పణ చేసుకుంటుంది.

హాఁ ప్రభు జనమ్-జనమ్ కీచేరీ।
సూరదాస్ ప్రభు కృష్ణ నృపతి బిను, ప్రాణ్ బినా తన లాగత్ ఫేరీ।
—సూరసాగర్ 10_4172

పూర్వరాగంలో పరమ విరహాసక్తి పెరిగి మాధుర్య భావంలో రుక్మిణి పక్షివలె ఎగిరి కృష్ణుని చెంతకు చేరుదామనుకుంటుంది. విషఫల భక్షణకైనను, బంధుజనుల వీడుటకును సిద్ధపడుతుంది.

సఖీ పర్ హోయిఁ తౌ ఉడి జాఊఁ।
జహాఁవై బసన్ నందకే ఢోటా, ఢూంఢీ లేఉఁ సోయిగాఉఁ।
కీజై కహా భయీ జౌ ఐసీ, కహౌంతౌ విషఫల్ ఖాఉఁ।
హిరదేమేరై దవాజరతిహై, గహిరే నీక్ అన్హాఊఁ॥
బంధువైర్ కహిధౌ జదుపతిసౌఁ. తాఢీనహి తహారాఉఁ।
సూరదాస్ ప్రభు అసుర వివాహీ, ధరతీ ఫాటిసమాఉఁ॥
—సూరసాగర్ 10_4793.

'మాన్' ప్రసంగములో అన్యసతుల వెంట ప్రియుని జూచి పతియొక్క హావ భావ వికారాల చేష్టలలో పరివర్తన జూచి తనను ఉపేక్షించుట సహింప లేక అలిగి కూర్చుంటుంది. భక్తి క్షేత్రంలో ఉపాసకుడు, ఉపాస్యుని పట్ల అలుగుతాడు. సర్వ

స్వామును సమర్పించినప్పటికీ పట్టనట్లు నటించు ఈశుని యెడ ప్రణయాతిరేకంలో ప్రేయసి అలుక బూనుతుంది. ప్రేమ భక్తి ఉజ్జ్వలమై ప్రగాఢమై విరహము తీవ్రమై కృపాలుడు ప్రసన్నుడయ్యేంతవరకు కొనసాగుతుంది. అక్కడికే బొమ్మని కసరి విసరి కొడుతుంది.

తహఁయి జాహు జహఁరైని బసైహా।
కాహేకాఁ దాహన్‌హాఁ ఆయే అంగ్-అంగ్ చిహ్నాల
సేహా॥
అరగజ అంగ్ మరగజీ మాలా, బసన్ సుగంధ్ భరేహా।
కాజర్, అధర్, కపోలని బందన్, లోచన్ అరక్‌ధరేహా॥
పలకని పీక్, ముకుట్ లై దేఖ్యో, యేకాన్‌హీఁ కరేహా॥
సూరదాస్ ప్రభు పీఠివలయగడే, నాగరి అంగ్ భరేహా॥
సూరసాగర్ 10-3120

పోతన పద్యం 'భ్రమరా! దుర్జన మిత్ర! ముట్టకుము మా పాదాబ్జముల్ నాగర ప్రమదాళీకుచ కుంకుమాంకిత...' స్ఫురణకు వస్తుంది,

దుఃఖకర పరిస్థితులలో ప్రియజనుల చేష్టలు స్మరణకు రాగా హృదయం వ్యథలకు గురి అవుతుంది. గోపికలు శ్రీకృష్ణుని బాల్యలీలలను, సంయోగదశలోని క్రీడలను మరల మరల స్మరించుకొని వ్యాకులచిత్తులౌతారు. ఆయా రూపాలలో తమను భావించుకొంటారు· తాదాత్మ్యం పొందుతారు.

కరతి హైఁ హరి చరిత బ్రజనారి।
దేఖహిఁ అతివికల్ రాధా, యహై బుద్ధివిచారి॥
ఇక్ భయీ గోపాల్ కౌబపు, ఇక్ భయీ వననారి।
ఇక్ భయీ గిరిధరన్ సమరథ్, ఇక్ భయీ దైత్యారి॥
ఇక్ భయీ ధేను బఛరా, ఇక్ భయీ నందలాల్।
ఇక్ భయీ జమలా ఉధారన్, ఇక్ త్రిభంగ్-రసాల్॥

ఇక్ ఛయిా ఛవి-రాసి మోహన్, కహతి రాధానారి ।
ఇక్ కహతి ఉతి మిలహు భుజభరి సూర్-ప్రభు కీ ప్యారి ॥
సూరసాగర్ 10-1739

సూరదాసు గొంతులో గొంతు కలసి పాడినట్లుగా **పోతన** పద్యం ఒకటుంది. ఇద్దరూ ఒకేచోట కూర్చుండి పరస్పరం సంప్రదించుకు టూ, ప్రశంసించు కుంటూ శ్రీమద్భాగవత అను**వాదం తమ** తమ భాషలలో చేసినట్లు కనబడుతారు.

పూతనయై యొక్కపొలతి చరింపంగ శౌరియై యొకకాం**త**
చన్నుగుడుచు,
బాలుడై యొక భామ పాలకు నేడ్చుచో బండి నేనను లేమ
బారదన్ను,
సుడిగాలి నని యొక్కసుందరి కొనిపోవ హరినని వర్తించు
నబ్జముఖియు
బకుడ నేనని యొక్క పడతి సంరంభింప పద్మాక్షుడను
కొమ్మ పరిభవించు

నేలమి రామకృష్ణులింతు రిద్దరు గాగ
గోపవత్స గణము కొంద రగుదు
రసుర వైరి ననుచు నబలయొక్కతె చీరు
బసులమనెడి సతుల భరత ముఖ్య!
—శ్రీమహాభాగవతము, 10-1019

ప్రేమవైచిత్రి పుష్టిమార్గంలోని విశిష్ట భావము. పరకాంతర విరహాను ప్రత్యక్ష రూప దర్శనం వల్ల జనిస్తుంది. ఇది సంయోగకాలంలోని ప్రేమయొక్క ఘనీ భూతస్థితి కాని విరహావ్యాకులత ఉంటుంది. దీనిని సంయోగమో వియోగమో చెప్పడం కష్టము, క్షణ క్షణం రంగులు మార్చే మాయా మానుష వేషధారి యొక్క లీలల ప్రదర్శనం. క్షణం దృశ్యం మరుక్షణం అదృశ్యమయ్యే వాని మధుర పరికల్పన ఉంటుంది. ప్రత్య

క్షునిఅప్రత్యక్షంగా, అప్రత్యక్షుని ప్రత్యక్షంగా అనుభవించడం దీని విశేషం. ఇది ఉన్నతమైన వ్యసనదశ. మనో వైజ్ఞానిక దృష్టిలో దీనిని స్వప్నజగత్తు అని చెప్పవచ్చును. దీనినే నిరోధసుఖము అంటారు. ఉదాహరణకు.

స్యామ్‌సోం కాహేకీ పహచాని।
నిమిష-నిమిష యహ రూపన్, వహ్ ఛవిరతికీ జైజియజాని॥
ఇక్ టక్ రహాతి నిరంతర్ నిసిదిన్ మన ముధిసోం చిత్ సాని।
ఏకో పల్ సోభాకీ సీవాం గుకతిన ఉర్ మహాం ఆని।
సము ఝిన పరై ప్రగట హీం నిరఖత్, ఆనంద్‌కీ నిధి ఖాని।
సఖి యహ విరహ సంజోగ్‌కి సమరస్ సుఖ్ దుఖ్ లాభ్ కి హాని॥
నృపతిన ఘృత్ తైం హోమ్ అగ్నిరుచి సూర్ సులోచన జాని।
ఇత్ లోభీ ఉత రూప్ పరమ నిధి కోఉన రహత్ మితి మాని॥

—సూరసాగర్ 10/2470

అనంత సౌందర్య వీక్షణలో గోపికలకు తనివి తీరదు. నిర్నిమేష నేత్రాలతో క్షణకాల వియోగమును సహించలేక చూస్తూ ఉన్నప్పటికే ప్రేమ పెరుగుతుంది.

హరి ముఖ కమలము జూచుచు
దరుణి యొకతె రెప్పలిడక తనియక యుండెన్
హరిపద కమలము జూపుచు
మరిగి తనివిలేని సుజను మాడ్కి నరేంద్రా !

శ్రీమహాభాగవతము 10/1060.

విరహాగ్నితప్తమైన హృదయం ఉన్నదావస్థలో ప్రవేశించి ప్రకృతిగతమైన వానిని వికృతులుగా వికారములుగా భావిస్తుంది. మధువనమా! పచ్చగా ఎందుకున్నావని ఎండిపోలేదేమని దండిస్తుంది.

మధువన్ తుమ్ క్యోఁ రహత్ హరే।
విరహ్ వియోగ్ శ్యామ సుందర్ కే ఠాడే క్యోఁన జరే॥
సూరసాగర్ 10-3828

విరహతీవ్రతలో వ్యాధిగ్రస్తయై గోపిక మానసిక సంతులనము కోల్పోతుంది అప్పుడు ఎంతో అందంగా కన్పించేవి ఇప్పుడు పరమ వికార జన్యాలు. అప్పటి శీతల పదార్థా లిపుడు ఉష్ణ ద్యోతకాలు, కామజ్వర పీడతులకు అంతా అస్త వ్యస్త పరిస్థితి.

బిను గోపాల్ వైరినిభయి కుంజైఁ।
తబ్ వై లతాలగతి తన శీతల్, అబ్ భయి విషమ జ్వాల్ కి పుంజైఁ।
సూరసాగర్ 10_4686

విరహ దశలలో మృతి చివరి స్థితి. ఉపాస్యుడు ప్రాప్తిస్తాడు. భక్తికి పరమావధి ప్రియుని దర్శనం కొరకు సాధకుడు "నేను" ను కోల్పోతాడు. రాధ యొక్క ఇట్టి స్థితిని సూరదాసు వర్ణించాడు. రాధ మలిన వస్త్రము లోభమున ఉతకదు. జూదములో ఓడిన వానివలె ముఖము కడుగదు. కురులు ముడవదు. మలిన ముఖంతో దీన దశలో ఉంటుంది.

అతి మలీన వృషభాను కుమారీ॥
హరిశ్రమ జల భీరజ్యో, ఉర అంచల్ తిహిఁ లాలచ్ న ధువావతి సారీ॥
అధముఖ్ రహతి అనత నహిఁ చితవతి జ్యోఁ గధ్ హారే థకిత జువారీ॥
ఛూఁటే చికుర బదన కుమ్హిలానే, జ్యోఁ నలినీ హిమకరకీ మారీ॥
హరి సందేస సుని సహజ మృతక్ భయి ఇక్ బిరహిని దూజే అలిజారీ।

సూరదాస్ కై సై< కరి జీవై< బ్రజ బనితా బిన స్యామ దుఖారీ॥
సూరసాగర్-10-4692

పోతనగోపికలు కూడా ఇట్టి సందేశాన్నే పంపిస్తారు. ప్రాణములు నిలువవని కబు రంపుతారు.

తను జాసి యొక్కింత తడవైన నిట మీద నేలపై మేనులు నిలువ వనుము
నేలపై మేనులు నిలువక యటయున్న ధైర్యంబు లొక్కట దలగు నను:ము.
ధైర్యంబు లొక్కట దలగిన పిమ్మట చిత్తంబు లిక్కడ జిక్క వనుము,
చిత్తంబు లిక్కడ జిక్కక వచ్చిన బ్రాణంబు లుండక పాయు ననుము.

ప్రాణములు పోవ మరి వచ్చి ప్రాణవిభుడు
ప్రాణి రక్షకుడును తన్ను బ్రాణులెల్ల
జేరి దూరంగ మరి యేమి సేయువాడ
వేగ విన్నప మొనరింపవే మహాత్మ!
—శ్రీ మహాభాగవతము 10-1478.

సూరదాసుగోపికలు గోపాలకృష్ణుని నగుమోముపై ఆత్మార్పణము జేసుకొని జీవితమంతా అతని స్మృతిలో విరహంలో వియోగినులై గడపాలని కోరుతారు. మధుర భక్తి కిది పరమలక్షణము.

భ్రమరగీతాలు

గోపభామినుల పరమవిరహానికి ఉత్కృష్ట ప్రసంగం భ్రమరగీతలు. భ్రమర మనే మిషన గోపికలు కృష్ణుని ఉపాల భము చేసిన అన్యోక్తి కావ్యమిది. భ్రమరము, మధుకరము, మధుపము,

4)

అలి, షట్పదము, అలిందము, చంచరీకము, భృంగము అను పేర్లతో కుసుమ మకరందమద రసలంపటి, స్వార్థముతో అన్యకుసుమాలపై విహరిస్తుంది. విలాసి, విలోలుడు, అవిశ్వాసి, దుష్టుడు, శఠుడు అయిన పురుషుని కిది ప్రతీక. కృష్ణసందేశం మోసుకు తెచ్చే ఉద్ధవుని రూపురేఖలు దీనికి సమానం. ఈతని యెదుట తుమ్మెదను సూటిగాను కృష్ణుని అన్యాపదేశంగాను చెప్పిన కావ్యమిది. ఇంటికి వచ్చిన అతిథిని అవమానించడం గోపికలకు ఇష్టంలేదు. కాని హృదయం ఒప్పుకోదు, అందుచేత శిష్టహాస్యంతో ఈ ఉపాలంభకావ్యం సర్వాంగసుందరంగా తయారయింది.

గోపికల విరహ విదగ్ధ హృదయం సూరదాసు కలంచేత విస్తృతంగా వర్ణించ బడింది. హృదయాన్ని కదిలించి వేయగలిగిన ఇది ప్రత్యేక ఖండకావ్యం. నిర్గుణ ఉపాసనను ఖండించడం దీని ముఖ్యోద్దేశ్యం. సూరదాసుకు పూర్వమే ఉత్తర భారతంలో నిర్గుణవాదం బలం పుంజుకుంది. అగమ్యము, అగోచరము అయిన పరబ్రహ్మమును మానవ మండలంలో దింపి సామాన్య మానవునికి అందుబాటులో, అనుభవానికి సమీపములో ఇంద్రియ గోచరంగా, సరసముగా సూరదాసు చేశాడు. దీనికై ఎన్నో సందర్భాలు, సన్నివేశాలు ఎన్నుకున్నాడు.

హరిసందేశం ఉద్ధవుడు తెచ్చాడు. గోపికాలోలుడు గోపికల చిత్తములను హరించి పట్టుకుపోయాడు. తరువాత ఏమీ ఎరుగనట్టు సందేశం పంపి పుండు మీద కారం జల్లినట్లు దుఃఖమును పెంచుతున్నాడు కాని అతడు పంపిన జాబులను ఈ పల్లెలో చదివి వినిపించే నాథు డెవరు.

కో ఉ బ్రజ్ బాంచత్ నాహిఁ న పాతీ।
కత్ లిఖి లిఖి పఠవత్ నందనందన్ కఠిన్ విరహ్ కీ పాంతీ॥
నైన్ సజల్, కాగద్ అతికోమల్, కర్ అంగురీ అతి తాతీ।

పరసైఁ జరైఁ, బిలోకైఁ, భీఁజైఁ, దుహూఁ భాఁతి దుఖ్ ఛాతీ॥
కో బాఁచై యే అంక్ సూర్ ప్రభు, కఠిన్ మదన్-సర్ ఘాతీ।
సబ్ సుఖ్ లై గయే స్యామ్ మనోహర, హమకోఁ దుఖ్ దై థాతీ॥
—సూరసాగర్. 10-4108.

గోపికలు జాబులు చదవడంలో అసమర్థులు. సజల నయనాలతో జాబును తడిపి వేస్తారు. గోపికలు కృష్ణ స్వభావమును నిందిస్తారు. ప్రేమను పురిగొల్పి చివరివరకూ నిర్వహించక వంచన చేశాడు. విరహాగ్ని శిఖలలో మమ్మి పడద్రోసి నిశ్చింతగా రాజ్యం చేసుకుంటున్నాడు. కాంచన రత్న సంఘటిత సౌధంబులలో నాగర నారులతో కాలక్షేపం చేస్తున్నాడని ముఖ్యంగా అత్యంతరూపసి కుబ్జను ఏరి కోరాడని వ్యంగ్యం చేస్తారు. చక్కని చూడ ముచ్చటైన జంట కుదిరింది, రాజ హంసకు కాకికి ప్రేమ వ్యవహారం.

ఊధో జాకే మాథే భాగ్॥
బిలపత్ ఛాఁడి సకల్ గోపీజన, చేరీ చపల్ సుహాగ్॥
కుబిజా కా పటరానీ కీన్హీ, హమైఁ దేత్ బైరాగ్।
జోరీ భలీ బనీహై ఉన్‌కీ, రాజహంస అరుకాగ్॥
సూరదాస్ ప్రభు ఆంఖ్ ఛాఁడికే చతుర్ చచోరత్ ఆగ్।
—సూరసాగర్. 10-4270

గోపికల సరసోక్తులు, వ్యంగ్యోక్తులు పైకి కనిపించినా వాని వెనుక గుండె మంటలు రగులుతున్నట్లు స్పష్టమౌతుంది. వేటకానివలె కృష్ణుడు, అక్రూరుడు తమ తమ పాత్రలను నిర్వహించారని, తరువాత ఉద్ధవుడు నిర్గుణ నీళ్ళమూటలు మోసుకు తెచ్చాడంటారు. నీ నిర్గుణ జ్ఞానాన్ని కొనగలిగే యోగ్యులెవరూ లేరంటారు. నీ వ్యాపారం ఇచ్చట సాగదంటారు. మాయిష్టం

మాదంటారు. ఉద్ధవుని మనసు నొచ్చుకోకుండానే చెప్పగలిగిన దంతా చెప్తారు. మాస్వభావానికి మేము కట్టుబడి ఉన్నామని అగ్నిని మెసవే కీటకము, అమృతమేల భక్షిస్తుందని అడుగుతారు.

ఊధౌ మన్ మానే కీ బాత్।
దాఖ్ ఛుహారా ఛాండి అమృతఫల్ విషకీరా విషఖాత్॥
సూరదాస్ జాకో మన్ జాసోం తాకో వోయి సుహాత్॥

—సూరసాగర్. 10_4639.

గోపికలది ఒక్కటే ఒక్క ఆకాంక్ష. కృష్ణాసక్తిలో ఆతని హాసవిలాసాల సందర్శన కొరకు విరహానురక్తి. తల్లిదండ్రులు, బంధువులు, యోగము, తపము, మోక్షము అక్కరలేదు. సుఖదుఃఖములను మానావమానములను సరకుగొనరు.

హమ్ అలికుల గోకులనాథ్ ఆరాధ్యో।
మన క్రమ వచ హరిసోంధరి. ప్రతివ్రత, ప్రేమ జోగ్ తప్ సాధ్యో।
మాతు పితా హిత నిగమ పంథ్ తజి, దుఖ సుఖ భ్రమ నాఖ్యో॥
మాన అపమాన పరమసంతోషి సుస్థలథితి మన్ రాఖ్యో॥
—సూర్‌సాగర్. 10_4148.

సూరదాసు భ్రమరగీత సాహిత్యము నానా భావ కల్లోలితమై విరహ బడబాగ్నితో నిండిన ప్రేమసాగరము. భక్తి, ప్రేమ, విరహముల పరమానంద మధుజలధి.

**లీలాతత్త్వము**

సూరకావ్యం శ్రీ వల్లభాచార్య ప్రణీతమైన శుద్ధాద్వైతతత్త్వానికి, పుష్టిమార్గభక్తికి, పుష్టిమార్గీయ సేవావిధానానికి అభివ్యక్తి. సూరదాసు పుష్టిమార్గమును శ్రీ కృష్ణ పరమాత్మని లీలల నాధా

రంగా అనేక విధాలుగా తనకావ్యంలో విశదీకరించాడు. అయినప్పటికీ ఆయన సంప్రదాయ మోహంలో పడక అనంత సత్యాన్ని ఎత్తి చూపించే అనేకానేక సాంప్రదాయాల రీతులను గ్రహించి తన కావ్యంలో పొందుపరచాడు. అంధానుకరణ చేయలేదు. తన సంప్రదాయాన్ని గౌరవిస్తూనే అన్యాన్య ఉపాసనా పద్ధతులను ఆదరించాడు. కర్మయోగము, సత్సంగతి, భక్తి మార్గముల ప్రశస్తిని చాటి చెప్పాడు. సూర్యుడు, గణపతి, దేవి, శివుడు, బ్రహ్మ మొదలగు దేవీ దేవతలను స్తుతించాడు. అద్వైత సిద్ధిని పొందాడు. అవతార లీలలలో రామకృష్ణుల అద్వైతం, సీతారాధల అద్వైతం హరిహర అద్వైతసాధన చేశాడు. అందరిలోను అఖండ అభేదత్వమును దర్శించాడు. శివకేశవుల అద్వైతం అత్యంతరమణీయం.

దేఖి అంగ్ అనంగ్ ఝుఝుక్యో నందసుత్ హరజాన్।
సూరకే హరదై బసానిత్, శ్యామ్ శివకౌధ్యాన్॥

సూరసాగర్. 10-788

ఈ సందర్భంలో భక్తపోతనయొక్క హరిహరుల పట్ల సమన్వయదృష్టి స్మరణకు వస్తుంది.

చేతులారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని,
దయయు సత్యంబు లోనుగా దలపడేని
కలుగ నేటికి తల్లుల కడుపు చేటు.

—శ్రీ మహాభాగవతము. 1-12

భక్తకవులు తమ ఇష్టదేవునిలోనే అన్యదేవతలను దర్శించుట భక్తుని సహజలక్షణమని నిరూపించాలు. అనేక రూపగుణములలో దర్శనమిచ్చే పరమాత్మని తత్త్వదర్శనం చేసి అట్టినిగూఢ రహస్యాన్ని సూరదాసు తనివితీర అనుభవించి మనసారా వర్ణించాడు.



# కావ్య సౌందర్యము

కావ్యంయొక్క ప్రధాన లక్షణం భావప్రవణత కావ్యకళ భావంపై ఆధారపడి ఉంటుంది. భావం స్వయంగా ఒక సంగీతము. చరాచరము లన్నింటిని ప్రభావితం చేసే మహత్తు దానికుంది. పండితులు పామరులు అటూ యిటూ గాక తెలిసీ తెలియని మిడి మిడి జ్ఞానంగల వచ్చీరాని చదువులు చదివిన సన్న్యాయలు అందరు భావంచేత అంతకంటె ముందు భావాన్ని మోసుకు తెచ్చే శబ్దసంపదచేత ఆకర్షితు లౌతారు. చిత్ర విచిత్రక్రమంలో కూర్చబడిన స్వరసమ్మేళనంతో ఏర్పడిన లయ భావానికి రూపాంతరమై హృదయాన్ని కదిలిస్తుంది, ఏర్చికూర్చిన ఛందస్సు రాగరాగిణుల సమన్వయం సంగీత మయమై భావమయమై కావ్యం జాగ్రతుని సుప్తావస్థలోకి సుప్తమానవుని జాగ్రదవస్థలోకి తీసుకపోతుంది. ఈ భావనాలోక ప్రవేశానికి శ్రోతను పాఠకుణ్ణి నిర్మల హృదయుడైన శిశువుగా జేని తన చిటికెనవ్రేలు సంకేతంతో లాక్కుపోయే కళావైభవం సూరదాసు కావ్యంలో అమోఘం. కావ్యగత శబ్దాలు అన్ని దశలలోను సమానంగా ప్రభవిష్ణువులై ఉండవు. కవులయొక్క శబ్దభండార ప్రాప్తి ఒకే విధంగా ఉంటుంది. ప్రతికవికి ఇది ఆర్జిత సంపత్తి. ప్రతివారికి ఒక విశిష్టమైన శీల సంస్కారం ఉంటుంది. శబ్ద సంపద భావసంపద ఎవరివద్ద ఎంత ఎక్కువగా ఉంటుందో సందర్భాలను బట్టి సమాయత్తం చేసుకుంటూ అభివ్యక్తి జరుగుతుంటుందో ఆ కవి అంత సమర్థుడు అవుతాడు.

కొందరు కవులు కావ్యజగత్తులో ముందు కురుకుతారు. కొందరు పైకి లేస్తారు. కొందరు లోతులలోకి వెళతారు. మరికొందరు ఆ లోతులలో దాగిన ముత్యాలను వెతికి తెస్తారు. ముందుకురికే వారిలో శబ్దసంపద చింతనావైభవం మరియు భావప్రవణత మొదలగు వాని అర్చన జరుగుతుంది పైకి లేవడంలో అర్థదీప్తి, భణితి

భంగిమ మరియు కళావైదగ్ధ్యము యొక్క ఉపలబ్ధి ఉంటుంది. లోతులను దర్శించడంలో రసవత్త ఉంది. ఏ కవి ఎంత లోతులకు వెళుతాడో ఆతని విమలమైన ఆలోచనలు భవ్యభావములు సర్వోత్తమ శబ్దాలద్వారా ఆ వ్యక్తిని పొందుతాయి. ఆ స్థితిలో శబ్దంనుండి భావాన్ని గాని భావంనుండి శబ్దాన్నిగాని వేరుచేసి చూడడం సంభవము గాదు. క్రోచే వక్కాణించిన విధంగా అట్టిస్థితిలోనే భావానికి కుశలతను అభివ్యక్తి ఉంటుంది. అట్టివారినే మనం కవులని గౌరవంగా పిలుస్తాము. భావజగత్తులోని అనంతపరిధుల్లోకి ప్రవేశించి కావ్యసాగర గర్భంలో నిక్షిప్తంగా నిగూఢంగా దాగిన మౌక్తికాలను వెతికి తెచ్చేవారే కవులు. సూరదాసు ఇట్టి ముత్యాలను లక్షావధికి పైన వెలికి తెచ్చి మనముం దుంచిన ఘటికుడు.

మహాకవి సూరదాసు కావ్య వైభవాన్ని తరచి చూచిన సమీక్షకు లెల్లప సమవేతస్వరంలో భావవైభవాన్నే గాక ఆయన శబ్ద సంపదను వేనోళ్ల కొనియాడిరి. స్వర్గీయ ఆచార్య రామచంద్ర శుక్ల గారు సూరదాసులో భావశబలత ఎంత ఉందో అంత వాగ్విదగ్ధత ఉందని చాటారు. వాత్సల్య విప్రలంభ శృంగారంలోని ఎన్ని రకాల భావనామయ స్థితులను ఆయన దర్శించారో చెప్పలేను.ఇది కవు లందరికీ సాధ్యం కాని పని. సూరదాసు శబ్దసంపద అతులము. శబ్ద సంపదయేగాక వానిలో ఆయన చేసిన ప్రయోగాలు అభూత పూర్వములు. ఒకే మాటను ఎన్నో రకాలుగా చెప్పి మెప్పింపగల సమర్థుడు ఆయన. ఆచార్య కుంతకుని వక్రోక్తి గరిమకు కావలిసిన ఉదాహరణలు సూరకావ్యంలో కోకొల్లలుగా లభ్యమవుతాయి. శబ్ద భండారము మరియు భావ వైభవములయొక్క ఇట్టి సంపృక్తత కలిగిన కవి మరే జాతికిని దొరకలేదనే చెప్పాలి. ప్రపంచంలో ఇంతటి కవులు ఎప్పుడోగాని అవతరించరు.

శబ్దసంపద

సూరదాసు శబ్దసంపద అపరిమితము. వ్రజ భూ నివాసి కాన వ్రజభాషలోని శబ్ద విన్యాసము ఆయనకు కరతలామలకము. అంతే

గాక అన్యభాషల మాండలిక పదజాలము వాని ప్రయోగము దేశ సంచారి ఐన భక్తప్రవరునికి వెన్నతో పెట్టిన విద్య. భాషా వైజ్ఞానిక దృష్టితో నాటి సాంస్కృతిక భాష అనగా నాటి రాష్ట్రభాషలో ఆయనకు అభినివేశం ఉంది. గుజరాతీలో నరసీమెహతా, రాజస్థానీలో మీరా, మహారాష్ట్రలో నామదేవ్, వంగదేశంలో కవులు అంతా వ్రజబోలీలో రచనలు చేశారు. నేటివలె ప్రాంతీయతామోహం నాడు లేకపోవడం ముదావహం. అదే విధంగా తులసీదాసు రామ చరిత మానస, మలిక్ ముహమ్మద్ జాయసీ యొక్క పద్మావత్ కావ్యం అవధిలో విరచితమైనప్పటికీ వ్రజ ప్రాంతంలో ఆదరణ ఉండేది. అనేక విభాషలకు మూలం సంస్కృతం. కావున ప్రాకృతం, పాలీ, అపభ్రంశాల క్రమంతో ప్రాంతీయతా విశిష్టతను పుంజుకొని ఉచ్చారణ శైలిలో భేదం కన్పించినప్పటికీ ఒక సాంస్కృతిక భాష వికసితమై ప్రచారంలో ఉండేది. భిన్నత్వంలోనే ఏకత్వం వైపు మొగ్గు చూపిన రాష్ట్రభాష వికసితమై ఉండేది. నేటి భారతీయ ప్రజకు రాష్ట్రభాషా సమస్యా పరిష్కారానికి ఇది వారి సందేశం. అన్ని ప్రాంతాలవారికి, భాషల వారికి హిందీ భాషను గ్రాహ్యమొనర్చటానికి సంస్కృతంలోని తత్సమతద్భవ శబ్దాల ప్రయోగం, ప్రాంతీయ భాషల పదజాలం యొక్క వాడుక ముమ్మరంగా జరగాలి.

సూరసాగర శబ్దశ్రీ దేశభాష యొక్క ఇట్టి క్రాంతిలో ప్రదీప్తమై ఉంది. సూరసాగర రచన ద్వారా వ్రజభాష ఇట్టి విశుద్ధమైన సాహిత్యక రూపాన్ని సంతరించుకుంది. వ్రజబోలీ సాధువుల చేతులలో భాషగా రూపొంది సంస్కృత శబ్ద సమన్వయంతో మసృణమై, కోమలమై, మధురమై, భావనా పటిమ కాలవాలమై బీహారు బెంగాలు, పంజాబులలో ప్రీతిపాత్రమైంది దక్షిణాపథ కవులకును రుచికరమై దాదాపు నాలుగు వందల సంవత్సరాల కాలం కవి కంఠాలలో జన మానసంలో రాజ్యం చేసింది. గద్యం పద్యంలో విపులంగా వ్యవహారంలోకి వచ్చింది. పుష్టిసంప్రదాయపు వార్తా సాహిత్యం నాటి కొన్ని ప్రబంధాలు, టీకలు, భాష్యాలు,

బ్రజభాష గద్యంలో విరచితమైనవి. ఏ భాషకైనా సర్వ వ్యాపకత్వం రావాలంటే తదితర సహయోగిని భాషల శబ్దజాలం చేర్చుకోవాలి. సూరకావ్యంలో పారసీ, అవధి, పంజాబీ, గుజరాతీ, మొదలగు భాషల పదజాలం వాడబడింది. ఖోయిస్, హోయిస్, మోర్, తోర్, కీన్, కేకో మొదలగు అవధి శబ్దాలు ప్రయుక్తాలు. బిబ మరియు సచ్ గుజరాతీ శబ్దాలు వేదకాలానికి తీసుకుపోతాయి వేదంలో "సచత్వ మరియు సతళ్చ, అసతళ్చ దివ" అని ఉంది. వివకు వికృతి బిబ, ఫ్రెంచి భాషలో నేడు Bevue వాడుకలో ఉంది. దీని కర్థం Two Sights రెండు దృష్టులు అని వేదము. గుజరాతీ బ్రజభాషలలో 'వివ' శబ్దాని కర్థం రెండు. పంజాబీ శబ్దం ప్యారీ మూల్యమైన అర్థంలో వాడబడింది. తెలుగులో ప్రియము అంటే విలువైనదని అర్థం ఉంది. బుందేల్ ఖండ్ శబ్దాలు గహెబీ, సాహిబీ అనునవి వాడబడినాయి.

సూరదాసు కావ్యవృత్తులను, గుణములను సమర్థవంతముగా వాడాడు. శబ్దశక్తులైన అభిధా, లక్షణా వ్యంజనలు నూతన కావ్యంలో అత్యుత్తమంగా ప్రయోగించాడు. లక్షణాశక్తికి ఉదాహరణ-

ముఖ్ పర్ చంద్ర డారౌ వారి
కుటిల్ కచ్ పర్ భౌంర్ వారౌ భౌంహ్ పర్ ధను వారి॥

—ముఖముపై చంద్రుని, కుటిలాలకాలపై భ్రమరమును మరియు భృకుటిపై ధనువును త్రిప్పి పారవేయవలెనని అర్థం. కాని ప్రచారంలో ఉన్న అర్థంతో సరిపెట్టుకుంటే స్పష్టం కాదు. ఏ వస్తువులనైతే త్రిప్పి పారవేస్తున్నాడో అవి మామూలువి కావు. ఏదో విశేషంతో కూడుకున్నవి. చంద్రుడు అందమైన వాడు. భ్రమరము నల్లనిది. ధనువు వక్రమైనది. కవి తాత్పర్యము ఏమంటే ముఖము సుందరమైనది. చంద్రుని అందము దానికంటే తక్కువ అయినది. కురులు నల్లనివి. భ్రమరము శ్యామలము అయితే కురులే అందమైనవి. భృకుటి వక్రము. ధనువు యొక్క వక్రత కంటే అతి సుందరమైనదని భావము, వ్యంజనకు ఒక ఉదాహరణ-

ఉర్ మే మాఖన చోర్ గడే
అబ్ కై సెహూఁ నికసత్ నాహిఁ తిరఛే హ్వైజు అడే।

గోపికలు తర్కంతో చెప్పేదేమంటే దిగబడి అడ్డం తిరిగిన వస్తువును బైటికి లాగడం కష్టం. కృష్ణుడు ముల్లు కాడు కదా! మరి గోపికల హృదయం పార్థివమైనది అంతకు కాదు. అనగా కృష్ణ సౌందర్యం నిరాకారం. గోపికల భావన నిరాకారం - గోపికల మనమున కృష్ణసౌందర్యం అంకితమైంది. ఇంతవరకు లక్షణ. సూరదాసు ఇంకా ముందుకు వెళ్ళి అర్థం చెపుతాడు. కృష్ణుని త్రిభంగిముద్ర అంకితమైంది. అది బైటికి వెళ్ళడం కష్టమే మరి. ఇందు వాచ్యసంభవ వ్యంజన ఉందని చెప్పవచ్చు. మరో ఉదాహరణ-

దేఖియత్ కాలిందీ అతికారీ
కహియో పథిక్ జాయ్ఁ ఉన హరిసోఁ భయీ విరహ జుర్ జారీ

యమునా నదిలో సహజంగా నీరు నీలం. కృష్ణ విరహ తాపం చేత నల్లబడిందని కవి వ్యాఖ్యానం. తాపంచేత ఏదైనా నల్లబడడం సహజం. సహజ వర్ణమును ఇలా చెప్పడం చమత్కృతి. వాక్ఛలము. కాని అర్థం ఇంతటితో సీమిత మవదు. గోపికల గౌరవర్ణము - శ్యామలమైనదని వ్యంగ్యం. గ్రీష్మంచేత తప్తమై యమున ధార కృశిత మవుతుంది. అట్లే గోపికలు కృశగాత్రు లైనారని ధ్వని.

**శబ్దక్రీడలు**

శుద్ధాద్వైత తత్త్వములో జగత్తు హరివరుని సదంశము. జీవము చిదంశము. కనకకుండల న్యాయము ననుసరించి అంతా బ్రహ్మమే. జగత్తుజీవుని రూపంలో లీలలు నడుస్తున్నాయి బాహ్యాభ్యంతరములు ఒకటే. శబ్దము భావము క్రీడిస్తున్నాయి. సూరకావ్యంలో హృదయ పక్షము మరియు కళాపక్షము అనగా బాహ్యపక్షము. లీలా తత్త్వములో అనురంజితమై సహజమైన అం

గాలుగా విలాసం చేస్తున్నాయి. వీటిని గహనార్థములను గ్రహించటం దుర్లభమైనందున దృష్టికూటము లంటారు. సూరకావ్యంలో ఇట్టి శబ్దక్రీడ తాండవిస్తుంది. కౌతుకానికి దృష్టికూటపదములోని ఒక ఉదాహరణ.

సారంగ్ సమకర నీక్ నీక్ సమ సారంగ్ సరస్ బఖానే
సారంగ్ బస్ భయ, భయ బస్ సారంగ్, సారంగ్ విసమయ మానే
సారంగ్ హేరత్ ఉర్ సారంగ్ తే సారంగ్ సుత్ ఢిగ్ హిత్ ఆవే
కుంతీసుత సుభావచిత్ సమఝుత్ సారంగ్ జాయి మిలావే.

—ఈ పదంలో సారంగ శబ్దంచిత్ర విచిత్ర రీతులలో గంతులు వేసింది. నీక్ అంటే అచ్ఛా (మంచిది) అని అర్థము. అచ్ఛా నుండి "అక్షి" శబ్దం తీసి కవి నేత్రమని రాధానయనాలని అవి "సారంగ్" అనగా మృగమునకు సమానంగా ఉన్నాయని అన్నాడు. అనగా చంచల నయనాలని భావం చెప్పాడు. సంగీతంలో సారంగ్ అనే రాగం ఉంది. రాగ శబ్దంనుండి అనురాగమును లాగి రాధయొక్క అనురాగానికి వశమై "భయము" ఉన్నదనియు, భయమునకు వశీభూతమై అనురాగమున్నదనియు కవి చెప్పాడు. రాధయొక్క సంకోచ భావం మరియు అనురాగము కూడా సమానంగా ఉన్నాయన్నమాట. సారంగ్ అంటే సమాన రంగుగల సఖియని మరో అర్థం. రాధ చెంతనున్న సఖి ఆయమ విరోధాభాసవృత్తిపట్ల ఆశ్చర్యపడుతుంది. సారంగ్ అని కృష్ణుని కూడా అంటారు. ఆయన దృష్టి కమలము నుండి లేచి సారంగ సుత్ అనగా దీప సుత-కజ్జెలము-కాజల్-కాటుక చెంత చేరుతుంది. కనులు కనులు కలిసినాయని తాత్పర్యము కుంతీసుత స్వభావ మనగా కరుణస్వభావము-దానశీలము. రాధ యొక్క మాదక భావనమును గమనించి చెలికత్తె కృష్ణుని చెంతకు చేర్చి కలయిక సమకూరుస్తుంది. రాధాకృష్ణుల సమాగమము శుభసూచకము. ఇది సామాన్యుల కర్థముగాని ప్రకృతి

పురుషుల కలయిక. రహస్యోద్ఘాటనము. రహస్య శబ్దావళి ద్వారా అభివ్యక్తమయిన శబ్దవిలాసము ఇదే విధంగా మరో పదంలో "సోన జుహి" అను శబ్దం ద్వారా సోనజుహీ అనే స్వర్ణపుష్పం అని అర్థం చెబుతూనే అక్షరాలను విడదీసి సో-వహ్-అది-న-హిం కాదు. జు-జో ఏదైతే హే-హో- హృదయవాచకము. అదే-అనగా నీవు హృదయములో నిలిపినట్లుగా నేను అది కాదు. అనే పరమ రహస్యం తెలుపుతాడు. 'నేతి నేతి' అనే ఉపనిషత్తు వాక్యాని కిది కవి చేసిన అపురూప కల్పన.

## కల్పనయొక్క సమాహార శక్తి

ఉపనిషత్కారుడు "ఓమ్ బ్రహ్మణః" అంటూ దేనికి అనంతమైన గౌరవం ప్రతిష్ఠించాడో నేటి వైజ్ఞానికుడు దృష్టపదార్థము నుండి పరీక్షలకు అతీతమైన ఏ అదృష్ట పదార్థాన్ని పట్టుకోవడానికి నిరంతర కృషిచేస్తూ ఏశక్తి నాశ్రయించడానికి వివశు డౌతున్నాడో అట్టి అద్భుతశక్తిని కవివరునికి సహజంగా ప్రకృతి ప్రసాదిస్తుంది. దానినే కల్పనాశక్తిగా గుర్తిస్తారు. ఈ శక్తి ఎంత ఎక్కువగా ఉంటే ఆ కవి అంతటి అధికారి. అత్యుక్తి, అతిశయోక్తి దీని పరిధి లోనివే. ఒకేమాటను అనేక ఉక్తి చమత్కారాలతో ప్రవచిస్తాడు కవి. సూరదాసు అతి సామాన్యమయిన ప్రసంగాన్ని నవనవోన్మేష శాలినీ కల్పనా శక్తితో అసాధారణ చమత్కారం చేస్తాడు. భ్రమర గీతలు చాలా చిన్న సంఘటన. శ్రీమద్భాగవతంలో ప్రశస్తరూపం దీనికి లేదు. కాని సూరదాసు దీనికి విస్తృత రూపం ప్రసాదించాడు. కొన్ని విషయాలు కవుల చేతుల్లోపడి పిష్టపేషణ మాత్రంగా ఉండి పోతాయి. అవే మరికొందరి చేతుల్లో అభినవరూపం సంతరించుకుంటాయి. ప్రతిభాసంపన్నులయిన సూరదాసు వంటి కవుల అద్భుత కల్పనలో సహజం, సరసం, లోకోత్తర మవుతాయి.

సూరదాసు కుటుంబపరమైన సామాన్య ప్రసంగాలను నీరసములు, జటిలమైన వాటిని కల్పనాశక్తితో సరళము, రమ్యముగా

చిత్రించినాడు. అలంకారాలు కూడా కల్పనా శక్తిపై ఆధారపడి ఉంటాయి. వాటినిగూర్చి తరువాత ముచ్చటించబడింది. సూరదాసు కల్పనాశక్తికి "మైయా< మైనహి< మాఖన్ ఖాయో", అనే పదం మచ్చుతునక. ఈ పదంలోని ప్రతిచిన్న మాట సంశ్లిష్టమై పాఠకుని ముందు కృష్ణుడు నిలబడి తన అమాయక చేష్టలు ప్రదర్శిస్తున్నట్లు అనుభూతిని కలిగిస్తుంది. సూరదాసు కన్నులకు ముద్దు కృష్ణుని సరళమైన బాల్యరూపము, మరోమారు తుంటరి, లోభి కొంటె కోనంగి, విశ్వాస ఘాతకుడు, దొంగ మరియు యోధుడుగా కన్పిస్తాడు. అదేరీతి మురళి ప్రేయసిగా, సవతిగా, సౌభాగ్యవతిగా మరియు తపస్వినిగా రూపొందుతుంది. ఈ విధంగా లెక్కకు మించిన ప్రసంగా లెన్నో సూరసాగరం లోని అంతఃస్థలంలో ప్రదీప్తమై ఉన్న భావనామణుల పైన తమ ప్రకాశకిరణాలను ప్రసరిస్తున్నాయి.

**అలంకార సంయోజనము:-**

అలంకారాలు కావ్యసౌందర్యమును వృద్ధిపరుస్తాయి. కవితా కామిని యొక్క అంగ ప్రత్యంగాలను అలంకారాలతో అర్చన చేస్తాడు. భావం, గుణం, చింతన మరియు క్రియలకు కవి ఉత్కర్ష కలిగిస్తాడు. కావ్యగత విషయానికి ప్రౌఢత తెచ్చి కమనీయతను దీప్తిని వికసింపజేస్తాడు. సూరదాసు రససిద్ధ కవీశ్వరుడు భక్త పోతనవలె సహజ పండితుడు. సూరదాసు తన భక్తిమయ కావ్యానికి అలంకారమణులను పొదిగినాడు.

భావానుగుణంగా వ్యక్తంచేసి హృదయగమ్యము, బోధగమ్యము చేయడం కవి కర్మ. సూక్ష్మ భావాలను ఏ పద్ధతిద్వారా ప్రేషణీయం చేసి పాఠకులకు చేర్చాలో కవి ఉక్తి, శక్తియుక్తిపై ప్రతిభా పాటవాలపై ఆధారపడి ఉంటుంది. సూక్ష్మభావాలను స్థూలప్రతీకలద్వారా, స్థూలభావాలను, సూక్ష్మ విధానం ద్వారా స్పష్టం చేయడం కవి దక్షత, అనుభవాన్ని బట్టి ఉంటుంది. ఉపయుక్తమైన భావనల అభివ్యక్తికి

శబ్ద శక్తి, అర్థయుక్తి మరియు కథాకథన ప్రణాళిక అవసరము. అర్థాలంకారాలు ఉపమ, రూపకం, ఉత్ప్రేక్ష మొదలగునవి స్థూలమును స్థూలము ద్వారా లేక సూక్ష్మమును స్థూలము ద్వారా ప్రకటించే సర్వమాన్యమైన ఉక్తిపద్ధతులు, అన్యోక్తి, సమాసోక్తి, అప్రస్తుత ప్రశంస, శ్లేష మొదలగునవి కూడా ఈ కోవకు చెందినవే. ఇంకా ఎన్నో అలంకార గ్రంథాలలో చెప్పబడినవి లెక్కకు మించి ఉన్నాయి. వస్తుస్థితి ఏమంటే భావవిభావము అపారములు. వాటి అభివ్యక్తి ప్రకారములు అనంతము. 'అనంతపారం కిల శబ్దశాస్త్రం' మరియు 'కవయః క్రాంతదర్శినః' అనేవి తథ్యమును ప్రకటిస్తున్నాయి సూరదాసుకావ్యం ఇట్టి అలంకారాలకు ఆలవాలము, అలంకారాల అధ్యయనంలోనే గాక రస వివేచన దృష్ట్యా సూర కావ్యంలోని అలంకారాలు సాధనము మరియు సాధ్యము అని చెప్పక తప్పదు.

సూరదాసు శ్రుతిమాధుర్యం కొరకు అనుప్రాసను విస్తృతంగా ఉపయోగించాడు. శబ్దాలంకారాలలో అర్థమేగాక వర్ణము మరియు శబ్దముల అనురంజనము ప్రధానముగా ఉంటుంది. యమకాలంకారములో ఈ లక్ష్యం గోచరిస్తుంది. ఉదాహరణకు

1. ఊధౌ జోగ్-జోగ్ హామ్ నాహీం।
2. సారంగ్ వినయ కరతి సారంగ్ సో సారంగ్ దుఖ బిసరావహు।
3. నంద నందనదాసహిత సాహిత్యలహరి కీనహం।

సూరదాసు సార్థకమైన వర్ణసమూహాములచే యమకమును అధికంగా ప్రయోగించాడు, పైపంక్తులలో "జోగ్" పదానికి యోగమని, యోగ్యమని అర్థము "సారంగ్" అనే పదానికి సఖి, భ్రమరము (ఉద్ధవుడు, కృష్ణుడు) అన్ని

వరుసగా అర్థాలు. నందనందనుడు గోపనందుడు (యశోదపతి) మరియు ఆనంద ప్రసాది అయిన పుత్రుడు అని అర్థాలు. సూరదాసు శ్లేషను కూడ రమ్యంగా వాడాడు. దుహూకూల తరుణీ మిలీ తరత్‌న లాగీబాత్, తరుణి శబ్దంపై శ్లేష, తరుణి అనగా పడతి, నావ అని అర్థం. దృష్టికూట పదములలో పరిసంఖ్య, రూపకాతిశయోక్తి, సమాసోక్తి, ముద్ర, మొదలైన అలంకారా లలో శ్లేషప్రాధాన్యత ముఖ్యం. ఇదే విధంగా సూరదాసు వీప్సాపునరుక్తి, ప్రకాశ, వక్రోక్తి, మొదలగు వానితో తన కావ్యానికి శోభ గూర్చాడు.

మానవ శరీరం బ్రహ్మాండానికి సూక్ష్మరూపం. ఇక్కడ ఉన్నదే అక్కడా ఉంది. అంతేగాక అంతర్గతంగా నిబిడీకృతమై యున్న భావసౌందర్యం బాహ్య శరీరంలో ప్రస్ఫుటంగా తాండవించేదే. బ్రహ్మాండములోని దృశ్యాలలో ప్రతిబింబిస్తుంది. ఉపమాలంకారం ద్వారా అవగత దృశ్యంలోని క్రియల సాయంతో అనవగత దృశ్య క్రియలు స్పష్టం అవుతాయి. ఉదా హరణకు

హరి దర్శనకే సాథ్ ముయీ।
ఉడియ ఉడి ఫిరతి నైనన్ సంగ్ కరఫూ ఔ జ్యోం ఆకుతుయీ॥

ఈ పదంలో హరిదర్శనాభిలాష వర్ణించబడింది. ముయీ అనగా పిచ్చిది. దీనికి విశేషణము, అభిలాష, అటూ ఇటూ ఎగురుతూ తిరుగుతుంది. ఈ ఎగరడం తిరుగడం బూరుగు దూదివలె ఉందంటాడు సూరదాసు. కాయ పగులగానే దూది బయలువెడలి గాలికి అటు ఇటు తిరగడం విదితమే. నిరాశ్రయులై నిరవలంబులై గోపికలు ఉన్మాదావస్థలో తిరుగుతుండగా వర్ణించబడింది. సూరదాసు రూపక, సాంగ్‌రూపక్, పరంపరిత రూపక్, రూపకాతిశయోక్తి, అలంకారాలను ముగ్ధ మనో హరంగా వాడాడు.

ఉపమానం ఉపమేయం పరస్పరం స్థానాలు మార్చుకునే విధానం ప్రతీపాలంకారము అనబడుతుంది. ఉపమానము ఒకసారి ఉపమేయమును తృణీకరిస్తుంది. మరోసారి ఉపమేయం ఉపమానమును తృణీకరిస్తుంది. ఒక్కొకసారి ఉపమేయం ముందు ఉపమానం ఉపయుక్తంగాక వ్యర్థముగా నిరూపించబడుతుంది.

ఉప మాహారి తనదేఖి లజానే।
కోవూ జల్ మేం కోవూ బనమేం రహే దూరి కోవూ గగన
సమానే॥
ముఖ నిరఖత్ ససి గయో అంబర్ కో తడితదసన ఛవిహేరో।
మీన్ కమలకర చరన నయన ఉరుజల్ మేం కియో బసేరో॥
భుజాదేఖి అహిరాజ లజానే వివరనపై శే థాయ్।
కటి నిరఖత్ కేహరిఉర్ మాన్యో బన్ బన్ రహ్యో దురాయ్॥

పై పంక్తులలో ఉపమేయం యొక్క విశిష్టత చెప్పబడింది. ఉపమానములు ఉపమేయముల ముందు హేయములై వెలవెల బోతాయి. సిగ్గుపడి పోతాయి. ఇంతవరకు ప్రతీపాలంకారం కాని మరో ఉక్తి ద్వారా అవి అన్నీ జలములో ఆకాశంలో అడవిలో వివరములలో దాగుకొన్నాయి అనే కల్పన వల్ల హేతూత్ప్రేక్ష అని చెప్పుకో వచ్చును. ఉత్ప్రేక్ష, వ్యతిరేక, సందేహ, అపహ్నుతి, విభావన, విశేషోక్తి మొదలగునవి సూరదాసు కావ్యంలో కోకొల్లలు.

సూరకావ్యంలో అన్ని అలంకారాలు సహజ సుందరంగా ప్రయుక్తమైనాయి-సహజంగా ఉంటూనే చమత్కారాన్ని తీసుకు రావడం స్వభావోక్తి అనబడుతుంది. చిన్న చిన్న సంఘటనలలో కృత్రిమతా గంధంలేకుండనే హృదయానికి హత్తుకునే విధంగా అనుభూతికి సమీపంగా తాదాత్మ్యతను కలిగించేవిగా బాలచేష్టలతో స్వభావోక్తులు రచించడంలో సూరదాసు అందెవేసిన చెయ్యి. ఉదాహరణకు

1. సోభిత్ కర నవనీత్ లియే।
ఘుటురుని చలత్ రేనుతన మండిత ముఖదధి లేప్ కియే॥

2. మైయా కబహి బఢేగీ చోటి
కితీబార్ మోహి దూధ్ డియత్ భయి యహా అజహూం
హై ఛోటీ॥

పై పంక్తులలో బాలకృష్ణుడు చేత వెన్నముద్దగొని వంటి నిండా ధూళి పులుముకొని, ముఖము నిండా వెన్న రుద్దుకుని, తప్పటడుగులు వేస్తున్నాడు. రెండవ పదంలో కృష్ణుడు తనకు జుంపాలు ఎప్పుడు పెరుగు తాయే అమ్మా అని అడుగుచున్నాడు. నీవు చెప్పినట్లు ఎన్నో సార్లు నేను పాలు త్రాగాను. పాలు త్రాగితేనే జుట్టు పెరుగుతుందని లాలి స్తివికదా. ఇంకా నాజుట్టు పొట్టిగానే ఉందమ్మా అంటూ అలుగుతాడు. పిల్లల అమాయక మైన చేష్టలు ప్రతి ఇంట్లోను చూచేవే. బాలకృష్ణుని మన పిల్ల వానిలా మనకెంతో దగ్గరగా ప్రేమపాత్రునిగా సహజముగా చిత్రించుట సూరదాసు విశేషము.

దృష్టాంత, ఉదహరణ, ఉదాస్య, నిదర్శన, పరికర, సమాసోక్తి, వ్యాజోక్తి, సహోక్తి, అన్యోక్తి, లోకోక్తి, పర్యాయోక్తి, గూఢోక్తి, కావ్యలింగము, యథాసంఖ్యం, సమ, ప్రత్యనీక, ఆక్షేప, పరివృత్తి, పర్యాయ, ప్రహర్షణ, విషాదన, వ్యాఘాత, వికల్ప, విషమ, అర్థాంతరన్యాస తద్గుణ, అనుగుణ మీలిత, సూక్ష్మ మరియు సంశ్లిష్టము, సంకరము అయిన అలంకారాలెన్నిటినో ఉపయోగించి సూరదాసు వస్తు చిత్రణ, దృశ్యచిత్రణ, భావచిత్రణకు అభివ్యక్తి నిచ్చాడు. బాహ్య, ఆంతరిక, లావణ్యమును వెలికి తీసి చూపాడు. ప్రకృతి సౌందర్యమును, అతిప్రాకృతముగాను, అలౌకికదృశ్యాలను, లౌకికంగాను చిత్రించి స్వర్గాన్ని పృథివికి దింపి మనముందు ఆడించాడు. సూరదాసు కావ్యసాధన సరసభావ వీధులలో ప్రసరించి భక్తకోటిని ఓలలాడించింది.

సూరసాగర్ గీతి కావ్యము. సామవేదం గీతివేదం. నాటి నుండి సూరదాసు వరకు పరంపరాగతంగా వచ్చిన సాంప్రదాయా లన్నిటిని పుణికి పుచ్చుకున్న సంగీత సాగరము సూరసాగరము. జయదేవుడు, గోవర్ధనాచార్యుడు, జగద్ధరభట్టు, లీలాశుకుడు, విద్యాపతి, కబీరు మొదలగు వారి సాంప్రదాయాలన్నీ సూరదాసు వీణలో ఒదిగాయి. మధ్యలో వచ్చిన వీరుల ప్రశస్తులు, వీరగాథలు, వీరగీతలు, మొదలగు వాని ప్రభావము సూరదాసుపై పడలేదనే చెప్పాలి. జయదేవుని సౌకుమార్యం, విద్యాపతి శృంగారభావనల ప్రభావము సూరదాసుపై ఉన్నప్పటికి అన్ని క్షేత్రాలలో సూరదాసు వారిని అధిగమించి ప్రజావాణిలో బాణీలు రచించి స్వాభావికరీతిలో ఆధ్యాత్మిక తత్త్వాన్ని గీతం సంగీతంలో రంగరించి అనుపానం సిద్ధం చేసి ప్రజలను భవరోగం నుండి తరింప జేసే భక్తి ఔషధమును సిద్ధం చేశాడు. సూరదాసు గౌరి, విహాగ, నట, సారంగ, కేదార, మల్హార, సొరోర, జైత్ శ్రీ ధనాశ్రీ ఆదిగా గల రాగరాగిణితో హరిలీలాస్వరాలు పలికించాడు. కొన్ని రాగరాగిణులు సూరదాసు చేసిన అపూర్వ సృష్టియే. వాటిలో కొన్నింటికి లక్షణాలు చెప్పలేనిస్థితి నేటికి ఉంది. కొన్నింటికి నేడు ప్రచారము లేనందువల్ల కూడా ఈ పరిస్థితి ఏర్పడింది.

రాగరాగిణులు సంగీతాంతర్గతములు. కావ్యంలో ఛంద యోజన సంగీత సంబద్ధము. కొంత భేదము ఉన్నప్పటికి ఛందము కూడా గేయమే కదా. పాడకుండా వినిపించే యోగ్యత ఛందమునకు ఉండడమే విశేషము. అది విశిష్ట స్వరమయం. సంగీతాత్మకం, వాద్యతాళధ్వని సమన్వితమై ప్రభావాత్మకంగా రచించబడిన ఛందము గేయము అవుతుంది. ఛందము కంటే రాగప్రభావం అధికము. సూరదాసు పదాలలో సరళము సాధుస్వరములు, ప్రసన్న పదావళి ప్రాధాన్యత వల్లను పెద్ద పెద్ద సమాస భూయిష్ఠమైన భాష లేకపోవడం చేతను శృంగార ప్రవణత వల్లను సూరకావ్యకౌముది అనంతశోభలచే

విలసిల్లింది. ఆచార్య వల్లభుని ఉపదేశానంతరం సూరదాసులో గీతముల అజస్రధార ప్రవహించింది. సూరసాగరం హరి లీలాగాన లహరులలో ఉద్వేలితమై అనంతానందరసములో మూర్ఛనలు పోయింది.

గీతములేగాక పదిహేను మాత్రల చౌపాయి, చౌబేల మరియు పదహారు మాత్రల చౌపాయీలు, పన్నెండు మాత్రల తోమరము, పదమూడు మాత్రల చండిక, పదునాలుగు మాత్రల మానవ, పదహారు మాత్రల ఢిల్లా ఛందములు మొదలగునవి సూరకావ్యంలో ప్రయోగింపబడినవి.

సూరసాగరంలో వర్ణిక ఛందములు తక్కువ. ముప్పయిఒక్క వర్ణాల ఘనాక్షరీ ఛందము, ముప్పయిరెండు వర్ణాల జలహరణ ఛందముల యతులు మార్చి వాని రీతులలో నవీన గతులను చేర్చి వినూత్న ప్రభావం తెప్పించాడు. భావ వైశిష్ట్యాన్ని అనుసరించి ప్రసంగ సంగతుల కనుగుణంగా మానసిక సంఘర్షణలను ప్రకటించే విధంగా ఛందములను మార్చి అవి సరిపడక పోతే క్రొత్తవానిని సృష్టించి ఛందసాగరాన్ని సృష్టించాడు. అందు చేతనే సూక్తికారులు కొందరు వేనోళ్ళ కీర్తించి ఆయన పట్ల తమ భక్తిని ప్రకటించారు.

కిధాఁ సూర్ కో సర్ లగ్యో, కిధాఁ సూర్ కీ పేర్
కిధాఁ సూర్ కో పద్ లగ్యో, తన మన్ ధునత్ సరీర్.

**వస్తు చిత్రణము**

వస్తుచిత్రణలో ప్రకృతి చిత్రణ, రూపవర్ణన జరుగుతుంది. ప్రకృతి చిత్రణలో ఉషఃకాలము, సంధ్య, మధ్యాహ్నము, నిశీధి తారకావళి, ఋతువు, పర్వతము, సరితా సాగరాదులు, ఉద్యానవనములు, మరుభూములు, కాంతారము, కుంజములు, ఇసుకతిన్నెలు, మొదలగువాని చిత్రణ ఉంటుంది. మానవ నిర్మిత వస్తువులు అనేకములు. ప్రాసాదములు, గజయూథము, సైన్యము, సభావేదిక, గృహము వ్యంజనములు, కృషి మొదలుగా గల వివిధ వ్యాపారములు మొదలగు వాని వర్ణన ఉంటుంది. శారీరక చేష్టలు, శోకాహ్లాదాది

యుక్తమైన ముఖమండలము, ఉత్సాహదర్పములతో కూడిన భ్రూవిక్షేపాదులు, నేత్రవిన్యాసము, నాయికా నాయకుల వివిధ భావాత్మక వర్ణనలు జరుగుతాయి చేష్టాదులు భావచిత్రణాంతర్గతములు అయినప్పటికీ ప్రకృతిసాయము చేత అలంకృతములు. ప్రకృతి యొక్క అవలంబగతమై, ఉద్దీపనము చెంది మానవ క్రియా కలాపములు క్రీడా స్థలిగా సాహిత్యలోకము విలసిల్లుతుంది. ప్రకృతి రూపములు కోమలమై మృదు మధురమై ఆహ్లాదకారకములును, భయంకరములై కఠినములై, కర్కశములై ఉండును. కోమల రూపములును శాంతములును భయంకర రూపమున ప్రళయంకరములును ఉగ్రములునై యుండును, సూరదాసుసిద్ధహస్తమున వస్తుచిత్రణ పరమరమ్యంగా జరిగినది.

ప్రకృతియొక్క కోమలరూపముల నీ క్రింది పదమున గాంచ వచ్చును.

1. నవవల్లీ సుందరనవ తమాల, నవకమల మహా నవనవరసాల్

ప్రకృతి యొక్క భయంకర రూపమును గాంచుడు-

భహరాత్, ఝహరాత్, దావానల్ ఆయో,

ఘేరి చహుంజోర్, కరిసోర్ అందోర్ వని ధరని

ఆకాస్ చహుఁ పాస్ ఛాయో॥

ప్రకృతి కోమల రూపము మానవ హృదయానికి సుఖదాయకమై ఉండినప్పటికి దాని భయంకర రూపము కదలించి వేస్తుంది. ప్రకృతి యొక్క ఈ రెండు రూపములు వికృతి మరియు విషమ సూచకములు, విషమావస్థలో ప్రకృతి యొక్క ఈ రెండు రూపములు సుఖప్రదములో క్లేశప్రదములో కాక తప్పదు. వీని సామ్యావస్థ విలయము పరమానంద స్థితి.

సూరదాసు ప్రకృతిని అనేక విధాలుగా విస్తారంగా ఉపయోగించినాడు. ప్రాతఃకాల వర్ణన, తామ్రచూడమైన కోడికూత మొదలు నాలుగు ఝాముల సమాపనం. శీతల సమీర ప్రణవం అంధకారనివృత్తి, అరుణిమ, కిరణ ప్రసారం, చంద్రుని అంతర్ధానం, ముకుళిత కలువలు, అంభారించు ధేనువులు, బ్రాహ్మణుల వేద మంత్రాను

ష్ఠానం, వంటి ఉషఃకాలశోభను వర్ణించాడు. ఋతువులను సహజంగా వర్ణించాడు.

మానవ క్రియాకలాపములకు ప్రకృతివేదిక సూరసాగరంలో రాధాకృష్ణుల రాసలీలలకు, కేళీవిలాసములకు రంగస్థలి ప్రకృతి. ప్రకృతి మానవీకరణం పొంది సహృదయ సంవేద్యమై అనుభూతి గమ్యమై సూరసాగరం హరి లీలలకు ఆలవాలమై వెలిసింది. నిమ్న పదంలో మాయామానుషవేషధారి చతురనట చక్రవర్తి ఉన్నట్టుండి మాయమయ్యాడు. అతని వెదుకుతూ శుద్ధప్రేమోపేతులైన గోప కాంతలు కాంతారము లెల్ల గాలించి పరితపించారు. లతలను, పూలను, వృక్షము లను. పక్షులను పలుమారు పలుకరించి కృష్ణుని జాడలను అడుగు చున్నారు.

కైధారీ బన్ బేలి కహూం తుమ దేఖీహై నందనాదన్।
బూఝుహు మాలతీ కిధాం, తై పాయే హై తను చందన్॥
కైధా కుంద కదాబ వాకుల వట చంపక లతాల మాల్।
కైధా కమల కహాం కమలాపతి సుందరనయన విసాల్॥
మరళీ అధర్ సుధారసలై తరుర హే జమునకే తీర్
క్యోం తులసీ తుమ్ సబ్ జనత్ హౌ కహైం ఘనశ్యామ్
కైధా మృగీ కృపా కరి హామసోం కహి ధా మధువ్ మరాల్।
సూరదాస్ ప్రభుకీతుమ్ సంగీ హై కహ పరమ దయాల్॥

వనలతలారా! చెప్పండే! మరెప్పుడైనా శ్రీకృష్ణుని జూచితిరా! జమాలతీ! నీవు చెప్పవే, చందనచర్చిత శరీరుని దర్శించలేదటే! ఓ కమలికా, కదంబమా! వట వృక్షమా! తమాల చంకపలతా! సుందర విశాలనేత్రుడైన మాధవు గనలేదా! కమలమా! నీవైన చెప్పవే! కమలాపతితో నీకు విశిష్ట సంబంధం కలదు గాదే! యమునాతటిని వెలసిన తరులారా! ఎన్నోసార్లు మురళీరవముల శ్రవణ రూపమును మోహనుని అధరసుధారస ధారల గ్రోలినారు గద! మీరైనా చెప్పరే! తులసీమాతా! చెప్పరాదటె! శ్యామల వర్ణమున శ్యాముని సమత గలిగిననీవు ఎరుగవేమే! అరే ఎవరూ మాట్లాడరే! అమాయకచూపుల హరిణమా! కమలనయనుని కన్నులు పోలిన నీవైన చెప్పవే! మధు

పమా! నినుబోలు గిరిజాల జుత్తుగల నల్లనయ్య ఎటు బోయె చెప్పవే! మరాళమా! హంస నడకల అందగాడు ఏ దిశ కేగెనో చెప్పవే! మీరంతా సూరదాస ప్రభునికి సన్నిహితులట! ఆ దీనదయాలుని దర్శన భాగ్యము లెట్లు కలుగునో తెలుపరే.

పదంలోని ఏకాంగీ సంవాదం ప్రకృతి దృశ్యానికి మానవ తుల్యమైన చేతనా రూపం ప్రసాదించింది. భారతీయ సాహిత్యంలో తత్త్వతః ఈ రకమైన చైతన్య దృష్టి నిబిడీకృతమై ఉంది. శుద్ధాద్వైత దర్శనం ఈ సంప్రదాయాన్ని పోషించడమే గాక జడానికి బ్రహ్మరూపం ప్రసాదించింది.

**రూపవర్ణన**

సూరదాసు రాధాకృష్ణుల నఖశిఖ వర్ణనము అనేక పదాలలో కన్నులకు కట్టినట్లు చేశారు. శ్రీకృష్ణుని నఖము నుండి శిఖము వరకు ఒక పదములో, శిఖము నుండి నఖము వరకు మరో పదములో, కొన్ని పదములలో ముఖమునుండి కటివరకు వర్ణించాడు. పదనఖము, కర్ణకుండలములు, ముకుటము, అధరముల అరుణిమ, వక్షస్థలము, భుజములు, పీతాంబరములు, అలకావళి మొదలగు అంగాంగములపై అద్భుత కల్పనలు చేశాడు.

రాధయొక్క శృంగార వర్ణనము రమ్యంగా చేశాడు. రూపకాతిశయోక్తిలో సాధ్యవసానాలక్షణ ద్వారా క్రింది పదంలో రాధయొక్క నఖశిఖ వర్ణన అద్భుతం.

అద్భుత్ ఏక్ అనూపమ బాగ్।
జుగల్ కమల్ పర్ గజవర్ క్రీడత్ తాపర్ సింహ కరత్ అనురాగ్॥
హరిపర సరవర్ సర్ పర్ గిరివర గిరిపర్ ఫూలేకంజ్ పరాగ్
రుచిర్ కపోత్ బసత్ తా ఊపర్ ఊపర్ అమృత ఫల్ లాగ్
ఫల్ పర్ పుహుప్ పుహుప్ పర్ పల్లవ్, తాపర్ సక్ పిక్ మృగమద్ కాగ్॥
ఖంజన ధనుష్ చంద్రమా ఊపర్ తా ఊపర్ ఇక మునిధరనాగ్॥

ఈ పదంలో రెండు కమలములు రెండు చరణముల కొరకు, గిరవరులు ఉరోజుముల కొరకు. కంజపరాగము చర్చిత చందనము కొరకు, కపోతములు గ్రీవము కొరకు, అమృత ఫలము చిబుకమునకై, పల్లవములు అధరములకై, శుకము నాసికకై, కాకము చెవికై, ఖంజనము నేత్రములకై, ధనువు భృకుటికై, చంద్రుడు ఫాలమునకై మరియు మణిధరనాగమణి ముడిచిన కురుకుంచమునకై ప్రయోగింప బడినవి. కవిరాధా శరీరమును అందమైన ఉద్యానవనముగా వర్ణించాడు. అన్ని చక్కగా అమరినాయి. ధనువు చంద్రులను అన్వయించడం కష్టం. పుష్ప వాటికలో ధనుస్సు ఆకారంలో ఉన్న లతావితానం దానిపై చంద్రుడు వెలుగు చున్నట్టు ఊహించవచ్చును అనేక దృష్టికూట పదాల్లో రాధారూపం రమ్యంగా చిత్రించబడింది. ప్రకృతి స్వరూపిణి యొక్క రాధస్వరూపమును, హ్లాదినీ శక్తియైన రాధను, ప్రకృతి ఉపమలతోనే ఆనందమూర్తిగా వర్ణించడం సూరదాసు కళా విశేషం.

సూరదాసు మొదట భక్తుడు. తరువాత కవి, భక్తి తత్త్వాన్ని విదితం చేయడం కొరకు బ్రహ్మపదార్థాన్ని దానికి నిలయుడైన శ్రీకృష్ణుని, ప్రేమస్వరూపిణి రాధను, జీవకోటి ప్రతినిధులైన గోపికా గోపులను ప్రకృతిప్రతీకల ద్వారా అలంకారాల ద్వారా వర్ణించడం ధ్యేయంగా పెట్టుకున్నాడు. వర్ణించదలచినది బ్రహ్మం, దానికది సాధ్యం. కవి కళ, కవితా శక్తి నిమిత్త మాత్రం. పరమమైన దానికి పరమోజ్జ్వల మైన కావ్యకళ సహజంగా సంప్రాప్తించింది. పరముని వర్ణించ దలచిన సూరదాసు కలం తనంతట తాను నడుస్తుంది. ఋషి తపస్యాలక్షణం సంప్రాప్తిస్తుంది. సూరదాసు కావ్యకళ పరమోదాత్తమైనది.

**ఫలశ్రుతి**

సూరదాసు శ్రీమద్భాగవతంలోని రమ్యమైన ఘట్టాలను మాత్రం తీసుకొని ముక్తక కావ్యం రచించాడు. ఆయన

వర్ణనలో దాదాపు అన్ని స్కంధాలసారం సూరసాగరం నిండింది శ్రీకృష్ణ చరిత్ర ప్రధానస్థానం పొందింది. బాల్యలీలలు, కిశోరలీలలు, భ్రమరగీతలు అద్భుతంగా వర్ణించబడినాయి. ప్రతి ఘట్టంలోని సందర్భంలోను సూరదాసు పాఠకులకు ఫలశ్రుతి చెప్పాడు. భగవంతుని అనుగ్రహ సంపాదనయే భాగవత కథల ముఖ్యోద్దేశము. 'పోషణం తదనుగ్రహః'-అనే పుష్టి మార్గ నిర్దేశ సూత్రం ననుసరించి పరమాత్ముని భక్తి ప్రసాదించమని దానిని క్రమంగా పెంచి పోషించమనీ వేడుతున్నాడు. కోపమును వీడమన్నాడు, దయ చూపనిదే ద్వారము వదలనని ప్రతిజ్ఞ చేసి కూర్చున్నాడు.

అపనీ భక్తి దేహు భగవాన్
కోటి లాంచ్ జౌ దిఖావహు, నాహినై రుచి ఆన్

*　　　*　　　*

నాహి కాంచౌ కృపానిధిహౌం కరౌ కహా రసాయి।
సూర్ తఃహును ద్వార్ ఛాడై డారిహౌ కఢిరాయి

సూర్‌సాగర్ 1/106

సూరదాసు హృదయవీణతో స్వరం కలుపుతూ భక్తపోతన కూడ పరమాత్ముని దయ, సత్యము, సత్సంగతి, భక్తిని ప్రసాదించ మని వేడుకున్నాడు. మనకును అదే శరణ్యంగా భావిస్తాను.

నీ పాద కమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యమును నితాం
తాపార భూత దయయును
తాపసమందార! నాకు దయసేయగదే.

—శ్రీమహాభాగవతము 10/1268.

సూరదాసు కావ్యకళా సౌందర్యం అతి రమణీయం. దానికి మూలం పరతత్త్వమనే సత్యస్వరూపునికి సగుణ రూపకల్పన, సూరకావ్య పఠనం, శ్రవణం లోక కళ్యాణకరం. పరమానంద దాయకం పరమశివం.

హరిఓం తత్ సత్.

# సూర్ దాస్-జీవితం, సాహిత్యం.

—డాక్టర్ లీలాజ్యోతి

జగత్తు 'సత్-అసత్' అను రెండు తత్త్వముల సమ్మిశ్రణము. వీనిలో మొదటి అంశము ప్రపంచమును స్థిరమనియు, అనశ్వరమనియు చెప్పును. రెండవదియైన 'అసత్' అదే ప్రపంచమును అస్థిరమనియు అశాశ్వతమనియు పల్కును. జగత్తు మొదటిదానినిబట్టి చేతన పదార్థము; రెండవదానినిబట్టి జడ పదార్థము. మొదటిది మానసిక దృష్టి కలది; రెండవది పార్థివదృష్టికలది. మానవుఁడిట్టి ప్రపంచములో నొకభాగము. అతఁడు ఈ రెండు తత్త్వములను సంతరించుకొనినాఁడు. బ్రహ్మాండ కారణమైన తత్త్వమే యీపిండము(మానవు)నకును కారణమని "యత్పిండే తద్బ్రహ్మాండే"యను నుక్తిచే ఋషిపుంగవులు పేర్కొనిరి. వీరిలక్ష్యము ప్రాయికముగా ప్రపంచముయొక్క సదంశమునకు సంబంధించియున్నది. దీనికే వీరధిక ప్రాధాన్యమొసగి సాధ్యమని పేరిడి రెండవ పక్షమునకు సాధనమని పేరిడి దానిని ఉపేక్షించినారు. సాధ్యము సాధనముకంటె వేఱు; ఈ సాధ్యమునే ఉపనిషత్తులు 'ఆత్మతత్త్వము' అని వ్యవహరించినవి. ఆత్మయే చూడదగినదనియు వినదగినదికూడ అనియు దానికే ప్రాధాన్యమీయుమనియు తన్మూలమున కడమ జగత్తు హితమగుననియు నొక్కి వక్కాణించినవి. "ఆత్మవా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః నిది ధ్యాసితవ్యః", "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి"అని ఉపనిషద్వచనము. మానవుని యీ మానసికాంశ నిర్మాణమునకు అప్రత్యక్షముగ నెందఱో బాధ్యులగుదురు. మానవులెల్లరిపైనను మానసికముగ ఎంద ఱెందఱి ప్రభావమో ఉండును. పెక్కు ఋషులయు, మునులయు కవులయు ప్రభావము మానసికముగ మనపై నుండును. అని దీని తాత్పర్యము.

ఏ కవిదైనను జీవిత చరిత్రను తెలిసికొనుటకు మార్గములు రెండు (1) ఆంతరంగిక సాక్ష్యము (2) బాహిరసాక్ష్యము. కవి తన రచనలలో ప్రత్యక్షముగనో పరోక్షముగనో తననుగూర్చి చెప్పుకొనుట ఆంతరంగిక సాక్ష్యము. ఇది తరువాతి తరముల వారి కెంతయు ఉపకార

కము. కవియొక్క సమకాలికులుగాని అనంతరకాలిక విమర్శకులుగాని యా కవినిగూర్చి తమ గ్రంథములలో పేర్కొనుట బాహిర సాక్ష్యము. సాధారణముగ భారతదేశమున మహర్షులును మహామునులును పరమార్థ ప్రియులు. వారు ప్రత్యక్ష వస్తువుల యందేగాక పరోక్ష వస్తువులయందు సైతము పరోక్షముగనే ప్రేమాభిమానములను సువ్యక్తము చేయుచుందురు. పరోక్షము సిద్ధించినచో ప్రత్యక్షము తనంత తానే సిద్ధించునని వారి విశ్వాసము. అందుచే చాలమంది కవులు కావ్యరచన మొనరించియు తమను గూర్చిన పరిచితిని తామే కలిగించు పరిపాటి వారిలో తక్కువగా కానవచ్చును. వారు వినమ్రులు, తత్త్వదర్శకులేగాక యశోలాలస ఆత్మప్రశంస వంటి గుణములకు సుదూరులు. అందుచే తమ తమ గ్రంథములలో తమను గూర్చి పరిచయము కలిగించు అవసరము వారికి కనిపించెడిది కాదు. తమ ఆరాధ్యదైవముల గుణగానము చేయు తరి వారు అత్యంత తన్మయులై యుండెడివారు. ఆ తన్మయత్వములో వారికి తమను గూర్చి తాము భావితరముల వారికొఱకై చెప్పుకొనవలయునను ధ్యాసయే యుండెడిదికాదు. వారు అంతటి ఏకాగ్రమనస్కులై యుండెడివారు. అందువలన నట్టి మహానుభావుల ప్రామాణికమైన జీవితచరిత్రలను సమగ్రముగ తెలిసికొనుట కొంతవఱకు కష్టమే! అయినను రెండవ మార్గమైన బాహిరసాక్ష్యమును ఆధారముగ జేసికొని కొంతవఱకు వారి జీవిత విశేషములగూర్చి తెలిసికొనుట అంత అసాధ్యము కాదు. అట్టి తఱి కొన్ని విశేషముల ప్రామాణికత్వము సందిగ్ధమ్ముగ తోచ వచ్చును. విమర్శకుల విశ్వసనీయములగు కథనములను బట్టి అప్పటివఱకు ప్రామాణికములని తోచిన కథనములను విశ్వసించుటయే యీ సమస్యకు పరిష్కారము. ఈ రెండవ మార్గములో గూడ కవియొక్క సమకాలికులైన విమర్శకుల విమర్శనముల నధికముగా ప్రామాణికము లనవచ్చును. అట్టి కవులలో సూరదాసొక్కడు. ఈతడు హిందీసాహిత్యాకాశమునందు సూర్యుడు. అత్యంత ప్రముఖ కృష్ణభక్త కవి కూడ. ఈ కవి కావ్య సౌరభము నేడును లోకమును ముగ్ధ మొనరించుచున్నది. ఈయన కీర్తి ఐదు వందల సంవత్సరముల తరువాత కూడ దిగంతములయం దింకను

వ్యాపించి యున్నది. నేఁ డీతని పంచశతాబ్ద్యుత్సవములు భారతదేశము నంతటను ఘనముగ జరుగుచున్నవి. ఈతఁడు భక్తులలో నగ్రగణ్యుఁడు; కవులకు కంఠహారమువంటి వాఁడు. కవికులమునకు చూడామణి యనదగ్గవాఁడు. నేఁడు మనమీతని జీవిత భాగోళికాంశ నిర్మాణముతో ఏ ఏ అంశములు భాగస్వాములైనవో చూతము.

ఈయనను గురించి నేఁటివఱకును అనేక గ్రంథములు వెలువడినవి; వెలువడుచున్నవి; వెలువడగలవు. పరిశోధన రంగమునందు కూడ ఎందరో భావుకులు యీయననుగూర్చి పరిశోధనలు గావించిరి; కావించుచున్నారు. అయినను యీయన జీవిత సాహిత్యములను గూర్చి నేఁటివరకు 'ఇద మిత్థ'మని చెప్పఁజాలకుండుట బహుశోచనీయము. ఎందరో విమర్శకు లెన్నియో విమర్శలుజేసియు దృఢముగ యీయనను గూర్చి యేమియుఁ జెప్పఁజాలకున్నారు. కాని ప్రియత్నించి నేటివరకును మనకు లభ్యమైన అంశములను పైరెండు విధములుగ విభజించి చెప్ప వచ్చును. పోఁగా బాహిరాధారములను మరల రెండు విధములుగ విభజింపవచ్చును.

సూరదాసుని కాలమునాఁటి వారును, పిమ్మటివారిలో ప్రాచీనులైన వారును తమ తమ గ్రంథములందు యీ మహాకవిని గూర్చి తెలిపిన జీవిత ఘట్టములు, మొదటిశాఖకు చెందుచున్నవి. అనఁగా 'సాంప్రదాయిక సాహిత్యము' 'వార్తాసాహిత్యము', ప్రాచీన కవిభక్తాగ్రగణ్యులచేత ఉల్లిఖితమైన పద్యసాహిత్యమును, నాఁటి చారిత్రిక గ్రంథములును నీ శాఖ నాశ్రయించును. హిందీ సాహిత్య చరిత్రలను తదితర వివేచనాత్మక గ్రంథములును రెండవ శాఖకు చెందుచున్నవి.

సూరదాసుని పేరుమీఁద మూఁడు గ్రంథములు ప్రసిద్ధములు. (1) సూరసాగరము (2) సూర సారావళి (3) సాహిత్య లహరి అనునవి ఆ గ్రంథములు. తన యీ గ్రంథములలో మహాకవి సూరదాసు అక్కడక్కడ తననుగూర్చి తాను చెప్పుకొనినాఁడనుట నిస్సందేహము. సూరసాగరమునందలి కొన్ని పదములలోను, సాహిత్య లహరియందలి రెండు పదములలోను, సూరసారావళిదైన యొక పదములోను కవి తన జీవితాంశములను ఉల్లేఖించినాఁడు. "గురు పరసాద హోత యహ

దరసన సరసత్ బరస ప్రవీన। శివ విధాన తప కరో బహుత దిన్య తవూపార నహి వీన॥ అను 'సూర సారావళి' పద్యమునందలి మొదటి పంక్తికి నేఁటి విమర్శకులు సూరసారావళి రచించునప్పటికి సూరదాసు అరువది సంవత్సరముల వాఁడని అర్థము చెప్పుచున్నారు. ఈ అరువది యేడు అను దానికి 'విక్రమీ సంవత్' అరువదియేడు అనియు, 'అరువది యేడు సంవత్సరములనుండి' అనియు రెండర్థములు చెప్పవచ్చును. బృందావనములోని శ్రీనాధుని దేవాలయము 'విక్రమీ సంవత్' 1576లో స్థాపింపబడినది. అటు తరువాతనే సూరదాసునితో వల్లభునకు పరిచితి యేర్పడెను. అందుచే విక్రమి సంవత్ అరువదియేడు అనుటలో అర్థమే లేదు. అరువదియేడు సంవత్సరముల నుండి దర్శనమగుచున్నదనుట కూడ సహజముగ లేదు. ఏలన దీనివలన సూరదాసునిమృతి విఠల నాథుని మృతికంటె యెన్నియో సంవత్సరముల తరువాత కల్గినట్లు ధ్రువమగును. కాని విఠలనాథుఁడు సూరదాసుని తరువాత మృతిచెందుట సత్యము. కావున నీ యర్థముకూడ యుక్తియుక్తముగ లేదు. ప్రసిద్ధ విమర్శకులైన శ్రీ మున్షీరామ శర్మగారు ఒక పంక్తిని మాత్రమే గ్రహించుట ప్రకరణ విరుద్ధమని భావించి పై విషయము నంగీకరింపక పైరెండు పంక్తులను కలిపి యీ విధముగ నర్థము చెప్పుచున్నారు:-

కవి రెండవ పంక్తిలో తాను శైవ సంప్రదాయమును కొంత కాలము అనుసరించినట్లు స్పష్టముగఁ జెప్పుకొనెను. అందుచే వల్లభా చార్యుని సందర్శించుటకు పూర్వము సూరదాసు శైవుఁడనుట నిర్వి వాదము. 'అరువదియేడు సంవత్సరముల, పరిపక్వవయస్సులో గురు కృపవలన నీ దర్శనము కలుగుచున్నది.' మొదటి పంక్తికి అర్థము. అనఁగా అంతకు పూర్వము శైవమతము ననుసరించుకాలములో లభ్యము కాని భాగవత సంప్రదాయ సంబంధి లీలా దర్శనము రాధాకృష్ణుల యుగళమూర్తి దర్శనమును తనకిప్పుడు లభ్యమైనదని కవి భావము. ఈ దర్శన భాగ్యముచే కవిజన్మ సార్థకమైనది. వల్లభాచార్యుని వైష్ణవ ధర్మమునందు హార్దిదైన యీ లీలాదర్శనమునకు దానియందు లీనమగు టకును అత్యంత ప్రాధాన్య మీయఁబడినది. మోక్షముయొక్క సాయుజ్య స్థితికూడ దీనిముందు తుచ్ఛమే యని యీ ధర్మము ననుసరించు వారి

విశ్వాసము. అందుచే పై పద్యముయొక్క అర్థ మీ విధముగ చెప్ప వచ్చును.

శైవ విధానమున కనుకూలముగ తపస్యలో సూరదాసు అనేక సంవత్సరములు గడపినాఁడు. అయ్యును ఆతనికి తృప్తి కలుగలేదు. వల్లభాచార్యుని దర్శనమైన పిమ్మట ఈతనికి శాశ్వతమైన రాసలీలా దర్శనభాగ్యము కలిగినది. అప్పటికి సూరదాసుని వయస్సు అరువది యేడు సంవత్సరములనుటకు అభ్యంతరము లేదనవచ్చును. అప్పటికిని కవి ప్రౌఢ వయస్సునందే యుండి యుండవలెను. ఇట్లూహించుటకు అనేకములైన నిదర్శనలు కనబడుచున్నవి. సూరదాసుని సమకాలికుఁడైన గోస్వామి గోకుల నాథుఁడు తన గ్రంథమైన 'చౌరాసీ వైష్ణవోంకీ వార్తా' (ఎనుబది నలుగురు వైష్ణవుల జీవితచరిత్రలో సూరదాసుని 'స్వామి' అనినాఁడు. దీనినిబట్టి సూరదాసు గోకుల నాథునికంటె వయస్సులో పెద్దవాఁడని స్పష్టమగుచున్నది. అంతేకాక సూరదాసుని వెంట ఎందఱో శిష్యులుండిరని కూడ ఈతఁడు చెప్పినాఁడు. వల్లభాచార్యుఁడు 'అడైల్' నివాసి. సూరదాసుని నివాసస్థానము గవూఘాట్. సూరదాసు ఒక ఉచ్చకోటికి చెందిన అనుభవజ్ఞుఁడైన భక్తుఁడను కీర్తి వల్లభాచార్యుని 'అడైల్' నుండి 'గవూఘాట్'నకు రప్పించినది. రెండు గ్రామముల మధ్యను గల దూరము రమారమి కొన్ని యోజనములు. వల్లభాచార్యున కట్టి శిష్యుని ఆవశ్యకము ఎంతయో కలదు. ఇక ఆలస్యమెందులకు? ఆయన రెక్కలు కట్టుకొని గవూఘాట్ చేరినాఁడు. తనకు గావలసిన భక్తుని రూపమును గుణగణములును వల్లభునకు సూరదాసునిలో గనిపించినవి. ఆనాఁటి సూరదాసుని శిష్యులు ముప్పది సంవత్సరముల కంటె ఎక్కువ వయస్సుగలవారై యుండవచ్చును. కావున సూరదాసు అరువదియేడు సంవత్సరములవాఁడై, యుండుననుటలో ఆశ్చర్యము లేదు.

మహాప్రభు వల్లభాచార్యుని కలిసికొనిన పిమ్మట తనకు గల్గిన దర్శన భాగ్యమును సూరదాసు పెక్కునోళ్ల కొనియాడినాడు.

"సహస రూప బహురూప రూపపుని ఏకరూపపుని దోయ।
కుముద కలీ వికసిత అంబుజ మిలి మధుకర భాగీ సోయ॥ నలినపరాగ

మేఘ మాధురీ సో ముకుళిత అంబకదంబ। మునిమన మధుప సదారస శోభిత సేవత అజ దిన అంబ॥ సుఖ పర్యంక అంకధృత శోభియత కుసుమ కంద ద్రుమఛాయే। మధురమల్లికా కుసుమిత కుంజన దంపతి లగత సుహాయే॥ గోవర్ధన గిరి రత్నసింహాసన దంపతి రససుఖ ఖాన। నిబిడ కుంజ జహ కోవూన ఆవత రసవిలసిత సుఖమాన॥ నిశాభోర్ కబహూ నహిజానత ప్రేమమత్త అనురాగ। లలితాదిక సేవత సుఖ నైనన జరసహచరి బడ భాగ॥ యహ నికుంజకో వర్ణన కరి-కరి తవహే వేద పచిహార। నేతి-నేతి కర కహేవు సహస విధి తవూన పాయోపార॥

'చౌరాసీ వైష్ణవోంకీ వార్త' అను గ్రంథములో సూరదాస మహాభాగునకు వల్లభాచార్య మహోదయుడు దీక్ష నొసఁగిన పద్ధతి యీ విధముగ వర్ణింపఁబడినది :-

"సూరదాసు స్నానమాచరించి వల్లభుని యొద్దకు వచ్చినాఁడు. మహావల్లభుఁడు ఆయనకు నామాదికములు చెప్పి అతనిచే సమర్పణము చేయించినాఁడు. పిమ్మట భాగవత దశమ స్కంధము నాధారముగ చేసికొని తాను రచించిన అనుక్రమణికను చెప్పి పురుషోత్తముని సహస్ర నామముల వినిపించెను. దీనితో సూరదాసుని దోషములన్నియు దూరమై ఆతనికి అవధాతవ్యభక్తి సిద్ధించినది. భగవంతుని రూపము పరిపూర్ణముగ సాక్షాత్కరించినది. దానితో ఆతఁడు భగవంతుని లీలా గానము చేసెను. భాగవత దశమస్కంధముయొక్క సుబోధినియందలి మంగళాచరణమును ఆధారముగ చేసికొని సూరదాసు "చకయీ రీచలి చరణ సరోవర జహా న ప్రేమ-వియోగ" అను పద్యమును సరసముగను మనోహరముగను గానము చేసినాఁడు. ప్రేమ-వియోగము సుఖ-దుఃఖములు లేని భగవంతుని చరణములను సరోవరమును పోదము పదవే మనసా" అని ఎంత చక్కఁగ చెప్పినాఁడు. తనకు యథార్థముగ ప్రాప్తించిన సిద్ధివలన కలిగిన అనిర్వచనీ యానందము నీతఁ డిందు వ్యక్తము చేసెను. అరువదియేడు సంవత్సరముల వయస్సులో నిట్టి సిద్ధిని పొందుట ఆశ్చర్యజనకముకాదు. కాని అప్పటికే మన కవి తన మనోవాక్కాయ కర్మలచే సంయతుఁ డయ్యెనమటలో సందేహము లేదు. అంతకు పూర్వమునుండియే యీ భక్తకవి యిట్టి దీక్షను పొందుట కధికారము

సంపాదించి సంసిద్ధముగ నుండెను. పదను చేయఁబడిన పొలమునందు విత్తనములు సులభముగా నాటుకొనినట్లు వల్లభుని యుపదేశాత్మక బీజములు ఈతని మనస్సునందు సులభముగనే నాటుకొనినవి.

'సూరసారావళి' యందలిదైన యీ పద్యము వంటిదే యింకొక పద్యము యీతని రచనాంతరమైన 'సాహిత్యలహరి' యందును కలదు.

"కర్మయోగ పునిజ్ఞాన ఉపాసన సబహీ భ్రమ భవమాయో। శ్రీ వల్లభ గురు తత్త్వసునాయౌ లీలా భేద బతాయో"॥ భగవదనుగ్రహ ప్రాప్తికై కర్మజ్ఞాన యోగముల వంటి అనేక మార్గములయందు తిరిగి విసిగి వేసారి శాంతి లభింపక మాయలో పడియున్న సమయమున వల్లభాచార్యుని కృపవలన తాను హరిలీలా రహస్యమును పొందగల్గితినని దీనిభావము.

సూరదాసుని సుప్రసిద్ధ గ్రంథమైన సూరసాగరమునందు కూడ వల్లభునివద్ద దీక్షపొందుటకు పూర్వము ఈతఁడు శైవుఁడని చెప్పు సందర్భము లనేకములు కలవు. వల్లభాచార్యుని శిష్యశిష్టికి పూర్వము సూరదాసేమి చేయుచుండెడి వాఁడనునది సహజముగ కలుగు ప్రశ్న. 'గవూఘాటు' నందాతఁడు భగవద్ధ్యానము చేసికొనుచు ఆతని గుణగణములను గేయరూపమున గానముచేసికొనెడివాఁడు. కొన్ని కొన్ని పదముల రచన మాతఁడు అప్పటికే స్వతంత్రముగ చేయుచుండెడివాఁడన్న మాట. ఈ పదములలో వినయ భావ ముప్పొంగి పొరలు చుండును. అట్టివానిని సహజ పాండితీ ధురీణుఁడనుట కభ్యంతరమేమి ? ఆంధ్ర సాహిత్యాకాశమున చంద్రుని వంటివాఁడును తెనుఁగు భాగవతకర్తయు నగు బమ్మెర పోతనార్యుని జీవితము నొక్కసారి భావించుకొనుఁడు. ఆయన తనభాగవతమునందలి ప్రతిస్కంధము చివరను, "పరమేశ్వర కరుణా కలిత, కవితా విచిత్ర, కేసన మంత్రి పుత్ర, సహజ పాండిత్య పోతనామాత్యప్రణీత భాగవతము......." అని చెప్పుకొన్నాఁడు కదా! భాగవత రచనకు పూర్వము పోతన కవీంద్రుఁడును శైవుఁడనుట నిర్వివాదము. ఆయన తన యుక్తవయస్సులో రచించిన వీరభద్రవిజయమిందులకు తార్కాణము. చంద్రోదయ సమయమున తాను 'మహేశ్వర' ధ్యానమునందుండఁగా రామచంద్రుని సాక్షాత్కారమైనట్లు పోతనార్యుఁడు

స్వయముగ భాగవతమున చెప్పుకొనినాఁడు. ఇవటూరి సోమనాథుఁడు పోతన గురువని కొందర యూహ. సూరదాసుని 'సూరసాగరము' వలె భాగవతము పోతనార్యుని ప్రౌఢరచన. అట్టి భాగవతమునందెచ్చటను గురుప్రసక్తి రాలేదు. తనకొక గురువని యుండినచో నాతనిని పోతన స్తుతింపకుండునా? అందుచే నీతఁడును సహజ పాండిత్యము కలవాఁడనుట సత్యదూరము కానేరదు.

**సూరదాసుని రచనలు :—**

సూరదాసుని జీవిత ముఖ్యాంశములను పరిశీలించుటకుపూర్వము అతని రచనలను గూర్చి చర్చింతము. (1) సూరసాగరము (2) సూర సారావళి (3) సాహిత్యలహరి అను నీ మూడు గ్రంథములు సూరదాసునివిగా పేర్కొనఁబడుచున్నవని పైన చెప్పితిమి. ఇవిగాక మరికొన్ని గ్రంథములను సూరదాసునివని కొందఱు విమర్శకులు పేర్కొనిరి. అవి సూరసాగరముయొక్క అంశములుగాని అప్రామాణికములగు గ్రంథములుగాని యైయున్నవని శ్రీ వజేశ్వరశర్మగారు చెప్పుచున్నారు.

**సూరసాగరము :—**

ఇది సూరదాసుని సుప్రసిద్ధ గ్రంథము. సూరదాసుని కీర్తికిది యాధారశిల. దీని కర్తృత్వ మసందిగ్ధము. దీనియందు 'సవాలక్ష' (లక్ష యిరువదియైదువేలు) పదములను రచించెనఁట. కాని దౌర్భాగ్యవశమున నేఁడు పదివేలు మాత్రమే లభ్యమగు చున్నవి. కొందరు విమర్శకులు 'పదము' అనుమాటకు 'పంక్తి' అని అర్థము చెప్పిరి. లక్ష యిరువదియైదువేల పంక్తులు రమారమి పదివేలపద్యములు కాఁగలవని లెక్కలు కట్టిరి. వీనియందును నేఁడు ఐదారు వేలు మాత్రమే లభ్యమగుచున్నవి. దీనివైన ప్రతులు రెండు కలవు.

(1) మూల సూరసాగరము.
(2) ద్వాదశ స్కంధాత్మకము.

మొదటిది గ్రంథమునకు మూలరూపము. రెండవది మొదటి దాని పరివర్ధిత రూపము. ఇది సూరదాసుని యనంతరకాలమునఁగూడ పలుమారులు ముద్రింపఁబడినది. దీనియందు కవి తన జీవితాంతము వరకు రచించిన పదములన్నియు విషయము ననుసరించి సంకలితము

చేయఁబడినవి. కవి భాగవతము నాధారముగఁజేసికొని దీనిని రచించెను. ఇచట 'భాగవత' శబ్దమునకు భగవంతుని కథ అను నర్థములో వాడినాఁడు కాని వ్యాసుని భాగవతమను నర్థములో కాదనియు, కవి దృక్పథము భాగవతకారుని దృక్పథముకంటె భిన్నమనియు కొందరు విమర్శకుల యుద్దేశము. ఏదేమైనను యీ గ్రంథరాజమునందు శ్రీ కృష్ణుని సౌందర్యమునకు నాతని క్రీడలకును అధిక ప్రాధాన్యమీయ బడినది. భాగవతమునందలి దశమస్కంధమునందే కవి రస దృష్టి నంతయు కేంద్రీకరించినాఁడు. కృష్ణావతారమును వర్ణించు స్కంధ మదియే గదా! అందును నీతఁడు బాలగోపాలుని ఉపాసకుఁడాయె!

**సూరసారావళి :—**

"తా దిన్ తై హరిలీలా గాయీ ఏక్ లక్ష పదబందీ।
తాకౌ సార సూరసారావళి, గావత అతి ఆనంద॥"

అని యీ గ్రంథమునందు కవి చెప్పినాఁడు. "ఆ దినమునుండి భగవంతుఁడైన శ్రీహరి లీలాగానము ఒకలక్ష పదములలో చేసితిని; దాని సారమే సూరసారావళి" అని దీని యభిప్రాయము. సూరసాగరమునందు లక్ష పద్యములు లేనే లేవు! ఇది దాని సారమెట్లు కాఁగలదు? అని కొందరి ప్రశ్న. ఈ గ్రంథ మింకొక సూరదాసుదని మరి కొందరు. రచనా కౌశలమును ఇతివృత్త గౌరవమునుబట్టి డా హరివంశలాల్ శర్మవంటి విమర్శకు లనేకులు ఇది సూరదాసుని గ్రంథమే యని నిర్ధారించిరి. హోలీ జరుపు పద్ధతిననుసరించి దీనియందు ప్రకృతి వర్ణనము చేయఁబడినది. అనఁగా రూపకాలంకారము ద్వారమున ప్రకృతి సౌందర్యము ఇందు వర్ణింపఁబడినది. రచనావిధానమున సూరసాగరము నకును దీనికిని ఏమాత్రము పోలికయే లేదు. సూరసాగర భాగవత గ్రంథముల కథలు కూడ నిందు లేకపోలేదు. అయినను దీని రచనా విధాన మత్యంత మౌలికము.

**సాహిత్యలహరి :—**

దీనియందు నూటపదునెనిమిది పద్యములు కలవు. దీనిలోని చిట్టచివరి పద్యము సూరదాసుని జీవితమును వర్ణించును. కడమ నూట పదియేడు పదములలో రాధాకృష్ణుల యనురాగము, నాయికా భేదములు,

అలంకారములు, రసాంగములు, వర్ణింపఁబడినవి. సూరదాసుని శక్తి ప్రపూరిత హృదయముకూడ నిందు ప్రతిబింబితము.

సూరదాసుని కాలము :- దీనిని గూర్చియు విమర్శకులు అనేక అభిప్రాయములు కలిగియున్నారు.

పెక్కుమంది విమర్శకులు వల్లభాచార్యునికంటె సూరదాసు పదిదినములు మాత్రమే చిన్నవాఁడని నిశ్చయముగఁ జెప్పుదురు. వి సం॥ 1535 వైశాఖ కృష్ణపక్ష ఏకాదశి నాఁడు వల్లభాచార్యుఁడు జన్మించెను. దీనినిబట్టి వైశాఖ శుక్ల పంచమినాఁడు సూరదాసు జన్మించి నాఁడు. శ్రీనాథుని దేవాలయమున ప్రతి సంవత్సరము నిదే తిథియందు సూరదాసుని జన్మదినోత్సవము జరుపఁబడును.

'చౌరాసీ వైష్ణవోంకీ వార్త' ననుసరించి యీ క్రింది విషయములు తేటతెల్లములగును.

(1) సూరదాస వల్లభాచార్యుల సమావేశము.
(2) సూరదాసునితో అక్బరు సమావేశము.
(3) సూరదాస విఠలనాథుల సమావేశము.

వల్లభాచార్యుని దర్శన భాగ్యము 'గవూఘాటు' నందు సూరదాసునకు లభించెను. అప్పటి వల్లభాచార్యుఁడు పీఠమునలంకరించినాఁడు. బ్రహ్మచారి పీఠము నలంకరింప నర్హుఁడుకాఁడు. అందుచే నప్పటికే ఆచార్యులవారికి వివాహమైనదనుట యుక్తము. ఆయన వివాహము 'విక్రమి సంవత్' (1560-1561) పదునైదువందల అరువది-అరువది యొక్కటి ప్రాంతమున నైనది. సూరదాస వల్లభాచార్యుల సమావేశము దీని తరువాతనే జరిగినదనుట నిర్వివాదము. 'వల్లభ దిగ్విజయము'నందీ సంఘటన పదునైదువందల అరువదియేడులో జరిగినట్లు చెప్పబడుచున్నది.

వార్తాసాహిత్యము ననుసరించి విఠలనాథుని దేహావసానము 'సంవత్' పదునాఱువందలనలుబదిరెండులో జరిగినది. అంతకుపూర్వమే యనఁగా విఠల నాథుఁడు జీవించియుండగనే సూరదాసు దేహము చాలించినాఁడనియు 'వార్త' చెప్పును. కావున సూరదాసు 'సంవత్' పదునాఱువందల నలుబదిరెండునకు ముందే పరలోకవాసి యైనాఁడనుట

తూథము. 'సంవత్' పదునాఱువందల ముప్పదిమూఁడులో తాన్‌సేన్ సాహాయ్యమువలన అక్బరు సూరదాసుని గలిసినట్లుకూడ సుప్రమాణముగఁ జెప్పఁబడుచున్నది. అందుచే 'సంవత్' పదునాఱువందల ముప్పదిమూఁడు తరువాతనే సూరదాసు పరలోకవాసి యైనాఁడన్నమాట. 'సంవత్' పదునాఱువందల ముప్పది నాలుగునాఁటి యొక ఫర్మాన ననుసరించి విఠల్‌నాథునకు వ్రజభూమియందు యథేచ్ఛముగ నివసించుటకు వీలుకలిగినట్లును 'సంవత్' పదునాఱువందల ముప్పది ఎనిమిది నాఁటి యింకొక ఫర్మాన ననుసరించి అచ్చట నిచ్చవచ్చిన రీతిన గోవులను మేపుకొనుటకుగూడ అనుమతి దొరకినట్లు తెలియుచున్నది. ఆ సమయము నందే సూరదాసు విఠలనాథుని గలసినాఁడు. ఈ హేతువుచే 'సంవత్' పదునాఱువందల ముప్పదిఎనిమిది వఱకును సూరదాసు జీవించియున్నాఁడనుట కెట్టి యభ్యంతరమును లేదనవచ్చును. వార్తసాహిత్యము నందలి ఈ యథార్థములను బట్టి సూరదాసు రమారమి 'సంవత్' పదునాఱువందల నలుబది ప్రాంతమున గోలోకవాసి యైనాఁడని చెప్పఁజెల్లును

జన్మస్థానము :—

ఈ విషయమున సైతము విమర్శకులలో నభిప్రాయభేదము కలదు. కొందరు 'గోపాచల'మనియు, మఱికొందరు 'రునకత'యను గ్రామమనియు నింకకొందఱు 'సీహీ' అను గ్రామమనియు సూరదాసు నభిజనమును గూర్చి చెప్పుచున్నారు. వార్తసాహిత్యము సూరదాసుని జన్మస్థానముగ 'సీహీ' గ్రామమునే పేర్కొన్నది. ఈ గ్రామము ఢిల్లీ నుండి మధురకు పోవు మార్గమున నాలుగుకోసుల దూరములో నున్నది. కవి మియాసింహ్ డాక్టరు. హరివంశలాల్ వంటి ప్రసిద్ధ విమర్శకులు దీనినే సూరదాసుని జన్మస్థానమని నిష్కర్షించు చున్నారు.

ఇఁక సూరదాసుని జీవిత ముఖ్యాంశములను పరిశీలింతము. సాహిత్యలహరిలోని యీ క్రింది (ఒక) పద్యము ననుసరించి సూరదాసుని జీవితాంశములను చాలవఱకు గ్రహింపవచ్చును-

ప్రథమహీ పృథుజగతే భే ప్రగట అదభుతరూప
బ్రహ్మరావ విచారి బ్రహ్మరాజు నామ అనూప

పాన పయ దేవీ దియో సివ ఆది సుర సుఖపాయ ।
కహ్యౌ దుర్గాపుత్త్రి తేరౌ భయౌ అసి సుఖదాయ ॥
పాదిపాయను సురన కేపితు సహిత అస్తుతి కీన ।
తాసు బంస ప్రసంస మేభౌ చందచారు నవీన॥
భూప పృథ్వీరాజ దీనాం తినే హ్వాజ్వాలా దేస
తనయ తాకే చార్ కీన్హీ ప్రథమ ఆపునరేస॥
దూసరే గునచంద తాసుత సీలచంద సరూప
వీరచంద్ర పగ్రితాప పూరన భయౌ అదభుత రూప॥
రంత ఔర అమీర భూపతి సంగ ఖేలన జాత ।
తాస బంస అనూప భౌ హరచంద అతి విఖ్యాత ॥
ఆగరే రహి గోపాచలమే రహ్యౌ తాసుతవీర ।
పుత్రి జనమే సాత్ తాకే మహా భట గంభీర ॥
కృష్ణచంద ఉదారచంద జోరూప చంద సుభాయీ ।
బుద్ధి చంద ప్రకాశ చౌథీచంద భౌ భౌ సుఖదాయీ ॥
దేవచంద్, ప్రబోధ, సంసృత, చంద తాకీనామ ।
భయౌసప్తౌనామ సూరజ చంద మం దనికామ॥
సో సమర కరి సాహిస్యౌ సబగయే విధికే లోక ।
రహ్యౌసూ రజచంద దృగతే హీన భరి భరి సోక ॥
పర్యౌకూప పుకార కాహూ సునీన సంసార ।
సాతయే దిన ఆఇ యదుపతి కియోఆప ఉధార ॥
దివ్యచఖు దై కహీ సిసు సున మాంగవర జోచాయీ ।
హౌ కహీ ప్రిభు భగతి చాహత శత్రు నాస సుభాయి ॥
దూసరో నా రూప దేఖౌ, దేఖి రాధాస్యామ ।
సునత కరునా సింధు భాఖీ ఏవమస్తు సుద్రామ ॥
ప్రబల దక్షిణ విప్రకుల తే శత్రుహ్వై హై నాస ।
అఖిల బుద్ధి విచారి విద్యమాన మాన్నై సాస ॥
నామ రాఖే మేంర సూరజదాస, సూర సుస్యామ ।
భయే అంతరధాన బీతే పాఛపీనిసి జామ ॥

మోహి మనసా ఇహై ప్రజకీ బసోసుఖ చితథాప ।
థపి గుసాయి కరీమేరీ ఆఠ్ మధ్యే ఛాప ॥
విప్ర ప్రథుకే జాగ కోహై భావ భూరి నికామ ।
సూరహై నందనందన జా కో లయో మోలగులామ ॥"

దీనిని బట్టి ఈతనికి మూల పురుషుఁడు బ్రహ్మరావనియు హిందీ సాహిత్యమునకు ఆదికవియైన చందవరదాయీ యీ వంశము వాఁడే అనియు హరిచంద్రుఁడు సూరదాసుని పితామహుఁడనియు తెలియవచ్చు చున్నది. సూరదాసుని తండ్రిపేరు రాకుండుట మాత్రము దురదృష్టము. సూరదాసు తన తండ్రిని గూర్చి 'పిరుఁడ'ని కేవల మొకే యొక శబ్దము నుపయోగించినాఁడు. సూరదాసు భట్ట బ్రాహ్మణుఁ డనియు తొలుత యీతని పేరు సూరజ చంద్రుఁడనియు సన్యాసము స్వీకరించిన పిదప 'సూరదాసు' లేక 'సూరజదాసై' నాఁడనియు సాహిత్య లహరిని బట్టి చెప్పఁబడినది. ఈతని తండ్రి గోపాచల నివాసి. ఇది ఆగ్రాకు సమీపమున నున్నది కృష్ణచంద్ర, ఉదారచంద్ర, రూప చంద్ర, బుద్ధిచంద్ర, ప్రకాశచంద్ర, దేవచంద్రులని ఈతనికి అన్న దమ్ము లారుగురఁట. వీరందరును యుద్ధమునందు వీరస్వర్గము నలంక రించిరి. ఈ పదమునందు సూరదాసు తానప్పటికే 'దృగతేహీన' అనఁగా నేత్రహీనుఁడనని చెప్పుకొన్నాఁడు. ఈతఁడొక నూతిలో పడి ఏడు దినములందే యుండెననియు ఏడవ దినమున శ్రీకృష్ణుఁడు దర్శనమిచ్చి నాతనిని నూతినుండి పైకితీసి సర్వవిధముల నుద్ధరించి దివ్య చక్షువును ప్రసాదించెను. వరము కోరుకొమ్మనిన శ్రీ కృష్ణునితో "నీ దివ్యరూప మును జూచిన కన్నులతో నింకెవ్వరిని జూడఁజాల"నని చెప్పుకొనెనఁట. 'అట్టే యగు గాక' యని భగవంతుడు వరమొసఁగి అంతర్ధానమయ్యె నఁట. ఈతని భక్తికి దక్షిణ దేశమునుండి వచ్చు బ్రాహ్మణోత్తముఁడు తోడ్పడగలఁడనియు, భక్తిమార్గమునకు బాధాకరములగు కామక్రోధాది శత్రువుల నా బ్రాహ్మణ శ్రేష్ఠుఁడు జయించిన వాఁడనియు గూడ భగ వంతుఁడు చెప్పినట్లు పై గ్రంథము నందు గలదు. ఆ సాహాయ్య కారియే వల్లభాచార్యుఁడు. ఆతని పుత్త్రుఁడైన విఠలనాథుఁడు తనకు ప్రముఖ కృష్ణభక్త కవులలో (కవ్యష్టకములో) ప్రథమ స్థాన మొసఁగె నట్లు కూడ సూరదా సిందు జెప్పుకొనినాఁడు.

సూరదాసుని పై పద్యమువలన నాతఁడు నేత్రహీనుఁ డనుట స్పష్టము. 'ఈతఁడు జనుషాంధుఁడా? అనునది నేఁడు వివాదాంశము. కానిచో అంధత్వమెప్పుడు కలిగినది అనునది రెండవప్రశ్న. కొంత జీతఁడు జనుషాంధుఁడనియు మఱికొందఱు ఆంగ్లకవి మిల్టనువలె వార్ధకమునందు మాత్రమే నేత్రహీనుఁడైనాఁడనియు నందురు. 'సూరసాగరము'లోని యనేక పదములయందు కూడ నీతఁడు నేత్రహీనుఁడని చెప్పఁబడినది. అనఁగా సూరసాగర రచన తరువాత అంధుఁడైనాఁడని కొందఱు. పుష్టి మార్గమునకుఁ జెందిన 'హరిరాయ' అను భక్తుఁడు తన గ్రంథమునందు సూరదాసు జాత్యంధుఁడేయని వక్కాణించెను. సూరదాసునకు కనుగ్రుడ్లే లేవఁట. అట్టివానినే 'సూర్' అందురు. 'సూర్' అను శబ్దమునకు కనుగ్రుడ్లు లేనివాఁడని అర్థము. "జన్మాంధో సూరదాసో కభూత" యని 'సంస్కృత మణిమాల' యందు ప్రాణనాథ భట్టుని కథనము. ఈతఁడు సూరదాసుని 'సమకాలికుఁడు'. చౌరాసీ వైష్ణవాంకీ వార్త' అను గ్రంథమునందు కూడ రెండు తావులతో సూరదాసు గ్రుడ్డివాఁడైనట్లు చెప్పఁబడినది :—

(1) గవూఘాటునందు వల్లభాచార్యుఁడు సూరదాసుని కనినప్పుడు.

(2) అక్బరుపాదుషా దర్బారునకు సూరదాసు పోయినప్పుడును.

'అడైల్' నుండి వృందావనమును అచ్చటినుండి గోపాచలమును చేరిన వల్లభుఁడు సూరదాసుని కలిసి భగవంతుని యశోగానము చేయుమని యుపదేశించెను. అంత సూరదాసు వినయ భక్తికి సంబంధించిన కొన్ని పదములు గానము చేసెను విని "సూర్ హై కే ఐసా కాహేంకో ఘిఘి యాతహై? కఛు భగవద లీలా వర్ణన కరి" యని వల్లభుఁడు ఆదేశించినాఁడు. దీని తరువాతనే కవి సూరసాగర రచనము జరిగినది. అందుచే నప్పటికే మన కవి అంధుఁ డనుట సుస్పష్టము; అప్రతర్క్యమును.

అక్బరు పాదుషా సూరదాసు ప్రశంస విని యాతనిని తన దర్బారునకు బిలిపించెను. అక్బరు పాదుషా అడిగిన మీదట కవి "సూర్ ఐసే దరసకో ఏమరత లోచన ప్యాస" అను గేయమును మనోరంజకముగా గానము చేసినాఁడు. "నీ దర్శనమునకై యీ

కన్నులు పతితపించు చున్న"వని తీని శాపము విని "సూర్! మీకు కన్నులు కానరావే! అవి ఎట్లు తపించుచున్నవి? చూడకయే ఇట్టి ఉపమానములెట్లు వ్రాయగలుగు చుంటివి?" అని పాదుషా అడిగిన ప్రశ్నకు కవి నిరుత్తరమే ప్రత్యుత్తరము. కన్నులు గలిగియు భగవంతుని రూపమును దర్శింపలేని నీకు దివ్యచక్షువు లైన మాహాత్మ్యమేమి తెలియును? నీ వ్యర్థప్రశ్నలకు నేనేమి సమాధానము చెప్పగలను? అని యీ మౌనమునకు అర్థముకావచ్చును.

ఈ రెండు ప్రసంగములలోను కవిని 'సూర్' అని సంబోధించుట వినబడును. 'సూర్' అనగా కనుగ్రుడ్లు కూడ లేనివాడని పైన చెప్పితిమి. పుట్టుకతోనే గ్రుడ్లు కూడ లేని వాడగుట చేతనే 'సూర్' అని పిలువబడినాడు; అదే పేరుతో వ్యవహరింపబడినాడు. జన్మతః గ్రుడ్డివాడు అగుట చేతనే ఆ పేరు రూఢియై పోయినది.

ఒక విమర్శకుడు బిల్వమంగళుని కథను యీ సూరదాసునకు అంటగట్టి ఒక స్త్రీ సూరదాసుని కన్నులను పొడిచివేసినదనియు, స్త్రీకి సంబంధించిన విషయమగుటచే అది యాతనికి గౌరవ భంగమను నుద్దేశముతో 'వార్త సాహిత్యము'న జెప్పబడలేదనియు నది సత్యమే యనియు వక్కాణించెను. అనన్య రామభక్తుడైన తులసీదాసుని జీవితములో నిట్టి సంఘటనయే యాతని భక్తికి పునాదివేసినదని జగత్ప్రసిద్ధి. తన్మూలముననే యాతడు విరక్తుడై పరమ భక్తుడైనాడందురు. ఆనాడు తులసీదాసుని భార్య రత్నావళి

"లాజన లాగతి ఆపకో దౌరే ఆయహూ సాథ్ ।
ధిక ధిక ఐసౌ ప్రేమకో కహా కహూ మైనాథ్ ।
అస్థి చరమ మయ దేహ మమ తామే ఐసీ ప్రీతి ।
॥"

అని తిరస్కరింపకున్నచో నేడు తులసీదాసింతటి మహానుభావుడై యుండెడి వాడు కాడేమో! యనుటలో విప్రతిపత్తియు లేదు. ఒకవేళ నిట్టి సంఘటనయే సూరదాసుని జీవితములో ఘటిల్లియుండినచో అది వార్తా సాహిత్యములో రూపొంది యుండెడిది. ఆతని మాహాత్మ్యము

నకు కారణమైన యిట్టి సంఘటన ఏ విధముగను విమర్శకుల దృష్టి నుండి తప్పించుకొని పోలేదు. వార్తా సాహిత్య స్థాయికి దీనివలన లోపమును రాదు. ఏలన ఇట్టి సంఘటనలు అనేకములు దీనియందు వర్ణింపఁబడినవి. తులసీదాసునివలె సూరదాసుని ప్రేమయు స్త్రీచే దిఃస్కరింపఁబడి భగవంతునివైపు అనాయాసముగ మరలినచో అది కవి వ్యక్తిత్వమును మఱింత దృఢమును ప్రకాశవంతమును జేయఁ గలదు కదా!

'సూరసాగరము' నందు అనేక ఘట్టములలో కవి తన అంధత్వ మును గూర్చి చెప్పుకొనినాఁడు.

"రాస రస రీతి నహి బరని ఆవై ।
యహై మాంగో బార్ బార్, ప్రభు, సూర్‌కే నయన ।
ద్వౌ రహై న రదేహా పావూ"

దీనియందు కవి తన యంధత్వమును గూర్చి ముందు జన్మ యందు మఱల మానవ జన్మ కలుగునట్లుగను అప్పుడు భగవంతుని మంగళరూపమును దర్శింప వీలుగ నేత్ర భాగ్యము కలుగునట్లుగను జేయుమని ప్రార్థించినాఁడు. అనఁగా నీతఁడంధుఁడనుట స్పష్టము కదా! 'సాహిత్య లహరి' యందును కవి యీ విషయమును స్పష్టముగఁ జెప్పినాఁడాయె! ఈ గ్రంథము సూరసాగరమునకు ముందే రచింపఁ బడినది. 'వార్తా సాహిత్యము' నందును సూరదాసుని జనన సమయ మున నాతని తండ్రి దుఃఖించుట వర్ణింపఁబడినది తానొక నూతియందు ఏడు దినములున్నట్లు కూడ చెప్పుకొనినాఁడు. ప్రామాణికములగు కొన్ని బాహిర సాక్ష్యములు కూడ నీ ఘటనను సమర్థించు చున్నవి. తన 'భక్త వినోదము'ను గ్రంథమునందు మియాసింహ యీ విషయము నిట్లు వర్ణించినాఁడు :-

"ఏక దివస మారగ చలత, విధున కూపకలకోయ ।
దృగ విహీన చీన్హాన కఛు, లగ్యోభక్తచ్యుత హోయ ॥
గహతికరన కర తురత మురారీ భక్త కూపచుతవీన నివారీ",

అన్నలందఱు ముసల్మాను రాజులతోడి యుద్ధమున వీరస్వర్గము నలంకరించిరి. సూరదాసు దీనికెంతయో దుఃఖించినాఁడు. అతని

మనస్సు విరక్తి చెందినది. అట్టిపరిస్థితిలో నాతఁడిటునటు పోవుచు నొక నూతిలోపడినాఁడు, భగవంతునిదయవలన మఱల బ్రతికి బట్టకట్టినాఁడు.

ఈతని గ్రంథముల యందలి వర్ణనలు కవి కనులార వర్ణ్యము లను చూచినట్లును పాఠకుల కనులకు గట్టురీతిగ చూపునట్లును ఉన్నవి. నిర్దుష్ట దర్శనముగల కవియే సాధారణముగ నిర్దుష్టదర్శన మిప్పింపఁ గలడు. కావున సూరసాగర నిర్మాణానంతరమే కవి యంధుఁడైనాఁడని వీరి వాదము.

యథార్థమూహింప, అంధుల జ్ఞానచక్షువు చాల ప్రభావశాలియై యుండును. జనుషాంధులైనట్టియు అంధులైన పిమ్మటకూడ ఉత్తమో త్తమ రచనలు చేసినట్టియు మహాకవు లెందఱో ప్రపంచ సాహిత్య ముల యందు మనకు గాన వచ్చుచున్నారు. జాత్యంధుఁడైన నాభా జీయు ప్రజ్ఞాచక్షుసంపన్నులైన విరజానంద పూర్ణానందులవంటి మహాను భావులును మానవలీలలను వారి భావములను స్వానుభవములట్లు వర్ణనలు చేసినవారు పెక్కుఁరున్నారు. మహానుభావుల దివ్యనేత్రములు మన చర్మనేత్రముల కంటె నెన్నియో మడుగు లధికముగ శక్తిమంత ములై యుండును. పైఁగా స్వానుభవమును మాత్రమే చెప్పఁగల్గుట మహాకవి తత్త్వముకాదు. మానవుఁడు బుద్ధిజీవి; పశువువలె కేవలము స్వానుభవమునందే యాధారపడఁడు. ఈ సత్యమును వివరించి చెప్ప జాలకయో చెప్పినను అర్థము కాదను ఉద్దేశము తోనో "సూరదాస్! నీకు కన్నులులేవే! నీవిట్టి ఉపమానములనెట్లు ఇచ్చుచుందువు"? అనెడి అక్బరు ప్రశ్నకు సూరదాసుని తూష్ణీభావమే సమాధానమయ్యెను.

ఈ సంఘటన కిట్టి వాచ్యార్థమేగాక ఆధ్యాత్మిక పరమైన యర్థ మును గూడ చెప్పవచ్చును. "అజ్ఞానాంధువునందు కూలినాఁడు' అని కూడ దీనికి వాఖ్య చేయఁగలము. సూరదాసుని యాధ్యాత్మిక వికాసము నకు ఈ యర్థకల్పనము కూడ నెంతయో కార్యకారి కాఁగలఁడు. అజ్ఞాన మనెఁడిది నూయియని ఉపమానము సాధారణగ చెప్పఁబడు నదియే! సూరదాసుని నూఁతినుండి వెలుపలికిఁదీసి రక్షించినవాడు,

సాక్షాత్తు శ్రీకృష్ణుఁడే! అజ్ఞానమనెడి నూఁతినుండి రక్షించువాఁడు నాతఁడే! కవి యాధ్యాత్మిక వికాసమునకే సంఘటన మఱింత తోడ్పడుచున్నది. అందుచే నీతని జీవితములో దీనికిగల ప్రాధాన్యము అనుపమము. ఈ సంఘటనను తెల్పు "నరక కూపని జాయి జయపుర పర్యావార అనేక" వంటి పదము లనేకములు సూరసాగరము నందున్నవి. ఈ యర్థమీతని ఆత్మిక వికాసమును మఱింత బలపఱచును. యథార్థమునకు ఈ యర్థ ద్వయము పరస్పరము సంబంధమును అన్యోన్య పరిభావమును తెలుపు చున్నది.

శ్రీకృష్ణుఁడాతనికి వరమిచ్చు ప్రసంగము కూడ దీనితో నను సంధింపఁబడినది. 'భక్తవినోదము' నందును 'సూరసారావళి' యందును వర్ణింపబడిన ప్రసంగమును 'సాహిత్యలహరి' దైన యీ ప్రసంగము సమర్థించుచున్నది. ఒక అంతర సాక్ష్యమును వేఱొక ఆంతర సాక్ష్యమును మఱొక బహిర సాక్ష్యమును సమర్థించుచుండుట సిద్ధాంతీకరణమునకు బలము నిచ్చునుగదా!

ఈ మూడు ప్రసంగములు నీక్రింది విధముగ మూలగ్రంథము లందెట్లు వర్ణింప బడినవో వినుఁడు.

"దరసన దియౌ కృపాకరి మోహన బేగి దియౌవరదాన।
ఆగమ కల్పరమన తువహ్వైహై శ్రీముఖ కహౌ లఖాన॥

భక్తవినోదమునందు ఇదే ప్రసంగమును కవి యెట్లు వర్ణించి నాఁడో చూతము.

"సుని ప్రభు వచన సుఖద అభిరామా।
సూరదండవత కరత ప్రణామా॥
బోల్యో ఆమి ధన్య హౌ దీనా।
జేహి ఇన దిరగ దరస ప్రభుకీనా॥
ముని యోగిన సుర దుర్లభ జోయీ।
మోరే సులభ ఆజ్ జగసోయీ॥

అబ్ న దేవు ప్రభు సంసృతి కామా ।
ఏక్ స్మరణ తోర అభిరామా ॥
మోరే హృదయ లాలసా ఛాయీ ।
బిసరహి సోన భక్త-సుఖదాయీ ॥
అరుతుమ్హార మాయా బలవానా ।
కరహిన మోహి ముగ్ధ భగవానా ॥
హే కృపాలు కల కమల విమోచన ।
హృదయ భక్తజన సోచ విమోచన ॥
జిన్ నయనన అసరూప తుమ్హారా ।
మై ప్రితక్ష ప్రిభు లీన నిహారా ॥
తినసన జగత విలోకన కాహీ ।
దీన దయాలు మోరి రుచి నాహీ ॥
తాతే కరహ పూర్వవత మోరే ।
దృగ-విహీన బందహు ప్రభు తోరే ॥
ఖోలే కృష్ణ భక్తచితచోరా ।
సూర కథన సబ్ సంతత మోరా ॥
హోహి సత్య కఛు సంసయ నాయీ ।
ఖాఖి బదన అన త్రిభువన సాయీ ॥

సూరసారావళి పదమునందును దీనియందు నెంతసామ్యమో గమనించితిరా! "నీ దివ్యరూపమును ప్రత్యక్షముగ చూచిన యీ కన్నులతో నీ ప్రపంచమును చూడవలెనను కోరిక కలుగుటలేదు. కావున పూర్వమువలె నన్ను మరల నేత్రిహీనుని చేయుమని దీనియందు కవి శ్రీకృష్ణుని ప్రార్థించినాఁడు.

బాహిరసాక్ష్యములలో 'వార్తాసాహిత్యము' అత్యంత ప్రామాణికమనియు హరిరాయ్ చెప్పిన 'సూరదాసుని వార్త' యందు సూరదాసుని జనుషాంధత్వమును గూర్చి యుల్లేఖింపఁ బడినదనియు, పైన చెప్పితిమిగదా! ఒక బ్రాహ్మణ కుటుంబము నందొక బాలుఁడు జన్మించినాఁడనియు అతఁడు కనుగ్రుడ్లైన లేని 'సూరని'యు అంతనా గృహ

స్థుఁడు మనస్సునం దెంతయో ఖేదపడి 'బ్రహ్మ తమ్ము ముందే దరిద్రులను జేసెననియు అది చాలక యిట్టి బాలునికూడ తమ కొసఁగెననియు బల్కెనఁట! ఇన్ని అంతరబాహిర సాక్ష్యము లీతని జనుషాంధమును వక్కాణించు చుండఁగా మనము సందేహించు టేల? దీనిని బట్టి సూరదాసు జాత్యంధుఁడను విషయములో సందేహములేదు.

'వార్త' యందలి పంక్తులివి :

"వా బ్రాహ్మణనే అపనే మనసే బహూత సౌచ కియో ఔర్ దుఖపాయో జో దేఖో-ఏక్‌తో విధాతానే హమకో నిష్కాంచన కియో జౌర్ దూసరే ఘర్ మే ఐసో పుత్ర జనమ్యో" దీనిని బట్టి ఆతఁడొక దరిద్రకుటుంబము నందు జన్మించినట్లు కూడ స్పష్టమగును. రెండుమూఁడు 'మొహరీలు' దానముగా లభించినంతనే సంతసింపఁగల దారిద్ర్యము నాతఁడనుభవించినాడు. "తబ్ వహ బ్రాహ్మణ ఉన్ మోహారన కౌ లైకె అపనేఘర ఆయో, జౌర్ అపనే మనమే బహూత ప్రసన్న భయో" పోతనార్యునింత గర్భదరిద్రుఁడనలేము, పోతనామాత్యునివలె సూరదాసు కూడ చాల నాత్మాభిమానము కలవాఁడు. వీరిద్దరును రాజుల నాశ్రయించి రాజభోగముల ననుభవించుటకంటె దారిద్ర్యము ననుభవించుట సహస్రధా శ్రేయస్కరమని దలఁచిన వారు. అక్బరుపాదుషా సూరదాసుని కీర్తి ప్రతిష్ఠలను గూర్చివిని యాతనిని తన దర్బారున కాహ్వానించి తన గుణములను గానమొనరింపుమని యాదేశించెనఁట! అక్బరు చక్రవర్తి యంతటివాఁడు తలఁచికొనిన యేమిచేయలేఁడు? అయినను సూరదాసు కొంచెమైనను అతనికి భయపడలేదు-

"నాహిన రహ్యో మన్ మే ఠౌర్ ।
నందనందన అఛతకైసే ఆనియ ఉర ఔర్ ॥
చలత చితవత, దివస జాగత, సపన సోవతరాతి ।
హృదయతే వహ స్యామ మూరతి ఛన న ఇత ఉతజాతి ॥

నందనందనుఁడైన శ్రీకృష్ణుఁడు మనసులో ఎల్లవేళల చోటుచేసి కొని యుండఁగా నీవంటి మానవమాత్రులకు స్థానములేదని స్పష్టముగ

అక్బరుపాదుషా ఆజ్ఞలను తిరస్కరించిన ధైర్యశాలి సూరదాసు. ఒకటి రెండు పద్యములలో ఆ చక్రవర్తిని ప్రశంసించినచో యాతని సొమ్మేమి పోవును? పైఁగా కోరిన బహుమతులు లభించుచుగదా! శాశ్వతముగ రాజదర్బారులో స్థిరపడిపోయి 'ఆస్థానకవి' కాఁగల అవకాశమును కూడ సూరదాసు చేజార్చుకొనినాఁడే! పోతనార్యుఁడు నిట్లేకదా చేసినాడు !

"కమ్మని గ్రంథం బొక్కటి యిమ్ముగ నే నృపతికైనఁ గృతి యిచ్చినచోఁ గొమ్మని యియ్యరె వెయ్యా, ర్లిమ్మహి దున్నంగ నేల యిట్టి మహాత్మల్" అనెడు ప్రలోభనములను

"బాలరసాల సాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళలకిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతర సీమలఁ గందమూల కౌ
ద్దాలికులైన నేమి నిజదార సుతోదర పోషణార్థమై"

అని కాలదన్నిన వారే మహానుభావులు కదా!

రాజుల నాశ్రయింపక యావజ్జీవితము దారిద్ర్యము ననుభవించుట శ్రేయస్కరమని నమ్మినవాఁడు పోతనార్యుఁడు. పైగా "నిను నాఁకటికిం గొనిపోయి యల్ల కర్ణాట కిరాట కీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ!" అని సరస్వతీ దేవితో మనోవాక్కాయ కర్మల ప్రతిజ్ఞ ప్రతముకూడ చేసినాఁడు. మహాకవులందఱు నిట్టివారే! వారు దారిద్ర్యము ననుభవించుటకే సిద్ధపడిరి కాని తమ కావ్యకన్యకలను రాజుల పరము చేయుటకు సుతమామంగీకరింప కుండిరి. చూచితిరా మహాకవుల యాత్మాభిమానము! కావ్యకన్యకల యెడ వారి యభిమానము! వారిని యీరాజుల చేతిలో బెట్టినచో వీరు వారిని 'ముప్పుతిప్పలుపెట్టి మూఁడు చెరవుల నీళ్లు త్రాగింతు' రని వారి భయము. అంతకుమించి యాత్మాభిమాన మెన్నిరెట్లు! ఈ రెండును ఏకమై వారిని నిర్భయులను జేసినవి.

ఇఁక సూరదాసుని జీవితములోని కడమ అంశములను గూర్చియు చర్చింతము: పుట్టుగ్రుడ్డియగుటచే తలిదండ్రులీతనిని యుపేక్షించి

రఁట! సూరదాసు తాను విసిగి యిల్లువదలిపోయి యొక చెఱువుగట్టున నివసించుచు ఆరుసంవత్సరముల వయస్సు నుండియు జ్యోతిషము చెప్పసాగెనఁట! అప్పటికే యీతఁడు గానవిద్యయందు కూడ ప్రవీణత పొందగలిగెనని వదంతి. ఈరెండు విద్యలచే నెందఱో యీతనికి సమీపస్థులై శిష్యులైనారఁట. పదునెనిమిది సంవత్సరముల వఱకు నచ్చటనే యుండి యీతఁడు విరక్తిచెంది మధురచేరెను. అచ్చటినుండి గవూఘాట్ చేరికొనినాఁడు. హరిరాయని గ్రంథమున నీవిషయములు చెప్ప బడినవి. దానియందు రచయిత యీతని జన్మస్థానమును 'సీహీ' యనికూడ పేర్కొనినాఁడు. చౌరాసీ వార్తయందు కూడ నీతడు 'గవూఘాట్' నందు నివసించెననియు అప్పుడప్పుడు తీర్థయాత్రలు చేసెడివాడనియు నవనీత ప్రియుఁడైన గోపాల కృష్ణుని దర్శనార్థము తఱచుగ గోకులము పోవుచుండెడి వాఁడనియు శ్రీకృష్ణుని రాసలీలలకు కేంద్రమైన 'పారసొలీ' యందీతఁడత్యంత మనురక్తుడై తన జీవితశేషయాత్ర నచ్చటనే సమాప్త మొందించినాఁడనియుఁ జెప్పఁబడినది. డా॥ హరివంశలాల్ శర్మకూడ నీపక్షమునే సమర్థించు చున్నారు.

సూరసాగరమునందలి కొన్ని పదములాధారముగ కొందరు విమర్శకులు సూరదాసు గార్హస్థ్యజీవితమును గడపినట్లు చెప్పుచున్నారు.

(1) 'కితక దిన హరి సుమిరన బినఖోయే'

(2) "అబ్ మైనా చ్యో బహుత సపాల ।
కామ క్రోధకా పహిరి చోలనా కంఠవిషయ కీమాల।"

(3) "దోమే ఏకా తోన భయీ ।
నా హరి భజే నాగృహ సుఖపాయే వృథావిహాయి గయీ ।"

(4) "సుతని తజ్యో, తియ తజ్యో, భ్రాతతజి తన త్వచభయిజున్యారీ"

వంటి పదములెన్నో యీతని రచనలయందు గానవచ్చును. హరినామస్మరణ చేయకనే జీవితమంతయు గడచిపోయిన దనియు, భార్యాబిడ్డల బంధము తననీ సంసారమునందు కట్టి పడవేసిన దనియు

కవి యనేక మారులు చెప్పుకొనినాఁడు. దీనినిబట్టి కవి గార్హస్థ్య జీవిత మును గడపినట్లును, అది అంత సుఖదాయకము కానట్లును కవి మనస్సు ఆ సంసారమునందు లగ్నము కానట్లును ఆతఁడు విరక్తిఁజెంది సన్యాసము స్వీకరించినట్లును వీరవప్రిత్యయము. నాభాదాసుని 'భక్తమాల' మహారాజ రఘురామసింహుని 'రామరసికావళి' వంటి బాహిర సాక్ష్య ములుకూడ సూరదాసుని యీ జీవితాంశములను ధృవపఱచు చున్నవి.

సాహిత్య రంగమునం దీతని జ్ఞాన మపారమని వేరుగఁ జెప్ప నావశ్యకత లేదు. దానితోడైనదే యీతని సంగీత జ్ఞానముకూడ. ఈతఁడు రచించిన ప్రతి గీతమునకు రాగము పేరు చెప్పబడెను. సూర సాగరము నందడుగడుగునను సంగీతము తన ప్రభావమును చూపు చున్నది. సూరదాసుని కావ్యకౌశలమునకు సంగీతము మూలమన్నచో నతిశయోక్తి కానేరదు. ఈతని యీ జ్ఞానమపారము. ఈ మహాభాగుని వ్యక్తిత్వమునందీ కళలు రెండును సమ్మిళితములై మూర్తీభవించి కొట్ట వచ్చినట్లు కనబడు చున్నవి. వల్లభాచార్యుడీతని కావ్యకళకంటె సంగీత కళకు ముగ్ధుడై వృందావనము నందలి దేవాలయములో శ్రీనాథుని గుణ గానము చేయుబాధ్యత నీతనికి ఒప్పగించినాడనుట యిందులకు ప్రబల తార్కాణము "సూరదాసకో కంఠ బహుత సుందరహతో గానమే విద్యాచతుర ఔర సగణ బతాయివేమే చతుర ఉహసేవక భహుత భయో సో సూరదాస జగతమే ప్రసిద్ధభయో" యనుటను బట్టి సూరదాసు గాన విద్యయందు పారంగతుఁడను విషయమును 'వార్త సాహిత్యము' కూడ సమర్థించు చున్నది. ఈ గుణములను కవి ఎచ్చటినుండి సంత రించు కొనినాడనునది మనము తెలుసుకొన జాలని సంగతి. ఇట్టి విద్యా గుణములు బహుజన్మ కృత సుకృతము వలన పొందగల్గినవి మాత్రమే! దైవీ ప్రేరణయు పూర్వజన్మ సుకృతమును గలిసి సూరదాసు నింతటి వాని నొనరించినవి. కృష్ణభక్తియందు దీక్షపొందిన కవికి భగవంతుని లీలాగాన మొనరించుటకు ప్రోత్సాహ ప్రేరణలు కలిగినవి. అట్టివి

కలుగుట తోడనే యీతని శక్తులన్నియు నేకోన్ముఖముగ నుపొంగెనన వచ్చును. 'పుష్టిమార్గమునందు' దీక్షపొందిన సూరదాసునకు కావ్యసంగీత కళలదే గాక కడమ శక్తులన్నిటి యొక్కయు సహజ సంపన్న వాతావరణము సమకూడినది. ఈతని కాలమున వల్లభ సంప్రదాయమేకాక రాధావల్లభ సంప్రదాయమును సఖీ సంప్రదాయమును గూడ నధికముగ ప్రచారములో నుండెను. వానివలన సైతము వ్రజభూమియందు సంగీత సాహిత్యము లెంతయు వన్నెకెక్కినవి. సూరదాసుని కాలము నందే అక్బరు సామ్రాజ్యములో శాంతి సుస్థాపితమైనది. అప్పుడు సాంస్కృతికముగ గూడ మనదేశమున కెంతయో ఉన్నతిలభించినది. ఈ పరిస్థితులన్నియు సూరదాసుని కావ్యరచనను ప్రభావిత మొనరించి యాతని యనుభవజ్ఞతను సంగీత-సాహిత్య జ్ఞానములను పెంపొందించినవి.